

'దాగుడుమూతలు'లో ఒక దృశ్యం

మీరందరూ చూడవలసిన చిత్రం...







విశ్వేశ్వరరావు సమర్పించు విశ్వశాంతి చిత్రం

# హంతకుడెవరు?

దర్శకత్వం.. M.A. తిరుముగం

నిర్మాత.. చెరుకూరి శేషగిరిరావు

BRP

ఆంధ్ర... ప్రేమియర్ • సీడెడ్... జయలక్ష్మి • నైజాం... వాణి

# ఉత్తరాలు

## ముఖచిత్రం

మీరు త్వరలో ప్రచురించబోవు పత్రికపై ముఖచిత్రం అందరికి ఆశ్చర్యం కలిగిస్తుందన్నారుగా! ఎవరో వూహించలేమని కూడ అన్నారుగా! మరి చూడండి! విచిత్రం. మన ప్రధానమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రిగారిది కదండీ! అవునా ?

ఎ. వి. యస్. రాయుడు ఇంకా 3వ సం॥పు ....
ఇంగ్లీషు విద్యార్థులు (నెల్లూరు)

***ముఖచిత్రం మీ ముందే వుంది చూడండి!**

## కథలు

పాముల నిచ్చెన నన్ను ఎక్కువ ఆకర్షించినది. రచనా విధానము నన్ను ముగ్ధుణ్ణి చేసింది. పీతాంబరరావు లాంటి వ్యక్తులు జీవితంలో ఎప్పుడైనా తటస్థ పడవచ్చు. నిజంగా అతని చాకచక్యం అతని మాటకారి తనం నేను ఎప్పుడూ మరువలేను. అతను శిల్పంను పొగడినప్పుడు ఉపయోగించిన లౌకికము ఆఖరుకు దానిని తన వశం చేసుకున్న పీతాంబరరావు నా కంటికి ఇప్పుడు కూడా కనుపిస్తూనే ఉన్నాడు ఆ పాత్రను నేను ఎప్పటికి మరువలేను.

నిష్ఠమూర్తి (మద్రాస్)

*　　*　　*

"పాముల నిచ్చెన" కథ మీరు "మనలో మాట"లో చెప్పినట్లు చాలా గడుసు కథ. రచయితవూహా ప్రపంచములో చాలా విహరించారు. అయినా కూడా రచన చాలా సరదాగా, హాస్య రస భరితముగా ఉంది. పీతాంబరరావు వంటి వ్యక్తులు నేటి సమాజములో తరచు కన్పిస్తూనే ఉంటారు.

యల్. శాంత కుమారి (మద్రాసు)

*　　*　　*

"డాట్‌హౌస్" కథానిక చక్కటిసంఘటనలతో ఒక క్రొత్త పంథాలో వ్రాయడం జరిగింది. వనజ, జానకి, ఇందిర, మాలతి — వీరందరి జీవితాలను — వారి దృక్పథాల ను ఇంత చిన్న కథలో కూర్చడం రచనా సామర్థ్యానికి నిదర్శనం. అనుబంధాలను పెంచుకొని — చివరకు అవి దూర మయినప్పుడు వ్యక్తులు అనుభవించే ఆత్మవేదనని చక్కగా చిత్రించారు. ఒక కథానికని చదువు తున్నామని గాక — ఒక డైరీలోని పేజీలను తిరగ వేస్తున్నామా అని భ్రాంతి కలుగక మానదు.

"పాముల నిచ్చెన"లో నేటి ఆదర్శ యువకుల (అంటే బ్రతుక నేర్చిన వారి) గురించి చక్కగా వ్రాశారు. పీతాంబరం లాంటి వ్యక్తులు ఎంతోమంది ఉండి, మరొకరికి న్యాయంగా రావలసిన వాటిని అవలీలగా అందుకుని గొప్ప వారవడం ఈ రోజుల్లో నిజంగా జరుగుచున్న విషయం.

"శర్వాణి," పాండురంగారావు గార్లను అభి వందిస్తున్నాను.

డి. మధుసూధన్ (హైదరాబాదు)

*　　*　　*

17—7—64 పత్రికలో 'డాట్‌హౌస్' కథ చాలా బావుంది. 24—7—64 పత్రికలో కథలు, వ్యాసము, అన్నీ బాగున్నాయి.

మొత్తానికి పత్రిక చాలా ఆనందం కలుగ జేస్తున్నది.

ఎప్పుడూ, ఇలాగే, ఉండాలని ఆశిస్తున్నాము.

ఎల్. విశాల (మసూలిపట్నం)

శ్రీ హనుమంతరావు వ్రాసిన "గులాబి ముళ్ళు" అనే కథలో రావుకి ఉష కుటుంబానికి సంబంధము లేదు. అతని గూర్చి ఆమె విన్నది. అంతే. ఒకరి అభిప్రాయాలు ఒకరు తీసుకోవటానికంటే ఇల్లు చాలదా ? కారులోనే తిరిగి రావాలా ? కాబోయే భర్తతో ఇలా కారులో తిరిగి రావటానికి (తమ పరువు ప్రతిష్టలు దక్కించు కోవాలంటే) ఏ తల్లి దండ్రులు అంగీకరించరు. ఇది హిందూ సాంప్రదాయానికి వ్యతిరేకము.

అన్నే. కృష్ణకుమారి (వరంగల్)

*　　*　　*

ఆంధ్రసచిత్ర వారపత్రిక 24—7—64లో శ్రీ ఆనంద కృష్ణగారు వ్రాసిన "కలసిన ఆశయాలు" అన్న కథ చాలా బాగున్నది. ఈ కాలపు చదువుకొన్న యువతీ యువకుల మనస్తత్వాలను వర్ణించారు. రచయిత గారికి నా ధన్యవాదాలు.

ఆర్. రాజామోహన్ (హాస్పేట)

## సినిమా

ఇటీవల తమ పత్రికలో సినిమాలు, సినిమా నటుల గూర్చి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుచున్నారు. ఇది ఆంధ్ర సచిత్ర వార పత్రికకు అనుచిత మని చెప్పుటకు విచారించుచున్నాను. రాజధాని కబుర్లలోను, ఉత్తరాలలోను, అట్టమీదను, మరెక్కడ చూచినను వీటి గొడవేగదా!

పి. ఆర్. మూర్తి (చిత్తూరు)

## సహాయనిధి

మా (మీ) అభిమాన వారపత్రికలో ప్రచురించిన "ముఖ్యమంత్రి సహాయనిధి"కి శ్రీ యన్. టి. రామారావు గారి లక్షరూపాయలు విరాళము చదివి చాలా ఆనందించితిని. భారత దేశములో కెల్లా మొట్ట మొదటిసారిగా "ముఖ్య మంత్రి సహాయ నిధి" ఏర్పాటు చేసిన ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారికి, మొట్ట మొదటి విరాళముగా లక్ష రూపాయలు సమర్పించిన శ్రీ రామారావుగారు ధన్యులు.

ఆ నిధికి విరాళాలుగా వచ్చిన ధనమును నిలువ నీడలేక అల్లలాడుతున్న విజయవాడ అగ్ని బాధితులకు సరియైన విధముగా ఇచ్చి సౌకర్యాలను కలుగ చేయమని ముఖ్య మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను.

బాబు. ఆర్. యన్. (ఇండియన్ ఎయిర్ ఫోర్స్)



## ఇంటింటి పజ్యాలు

### ఆరుద్ర

### 'ఓఁ! దానికేం'

ఆమె యింట్లో చేస్తుంది అడ్డమైన చాకిరీ
అతను ఆఫీసులో చేస్తాడు హాయిగా నౌఖరీ
హోటేల్లో మస్తుగా తింటాడా మేతరి
ఇంటిమీద ఆయనకు ఉండదు ఖాతరీ
అర్థం చేసుకోరు భార్యలను భర్తలు
వీళ్ళకర్మానికి వాళ్ళే నిజంగా కర్తలు
పక్కింటి పిన్నిగారి కొత్తచీర సంగతి
ఇంటికి రాగానే చెప్తుంది ప్రేమించే దంపతి
ఆయన ఊదిపారేసే పొడు సిగరెట్ల ఖర్చు
ఆవిడ చీరల పద్దుకన్నా ఎప్పుడూ హెచ్చు
ఆప్యాయంగా రాత్రి కొనిపెడతానన్న నగలు
ఆయనగారు మర్చిపోతారు పట్టపగలు

### వరమిచ్చే పూజారి

ఆఫీసు మూసేసినా ఉంటాడు బంట్రోతు
ఆఫీసరు గుర్రం; అతగాడు రౌతు
అవాలా నీ పని అవకుండా జాప్యం
అయితే పెట్టు ఆ చేతిలో రూప్యం



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 7-8-'64
(క్రోధినామ సం॥ ఆషాఢ మాస బ॥ అమావాస్య

సంపుటము 56 సంచిక : 49

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలకు సీమెయిల ( Sea Mail ) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడి ప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1


ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**11-9-'64**

**ప్రత్యేక**

**హాస్య సంచిక!**

రచనలు పంపేటందుకు గడువు తేదీ 21-8-'64 అని గుర్తించ మని కోరుతున్నాము. సం॥

## మనలో మాట

శ్రీ జవహర్‌లాల్ ఏకైక పుత్రిక శ్రీమతి ఇందిరా గాంధీకి అడొక్కటే ఖ్యాతి కాదు. ఆమెకు రాజకీయంగా ప్రఖ్యాతి - ప్రాచుర్యం కూడా వున్నాయి. శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి మంత్రివర్గంలో ఆమె సమాచారశాఖా మంత్రిణిగా వుండటాన్ని రాజకీయ వేత్తలు కూడా హర్షించక పోలేదు. ఆమెను ఈ వారం 'ముఖ పత్ర సుందరి'గా పాఠకులకు అందివ్వడమే గాక - ఆమె పరిచయం కూడా లోపలి పేజీలలో వేశాము.

* * *

పైవారం సంచికను యిదివరకువలె బాలబాలికలకు ప్రత్యేక సంచికగా గాక "పెద్దవాళ్ళ సంచిక"గానే [స్వాతంత్ర్యదినోత్సవ సంచికగా] వేద్దామనుకున్నాము.

నవంబర్ పధ్నాలుగవ తేదీ శ్రీ జవహర్‌లాల్ జన్మ దినం. ఆ రోజు దేశవ్యాప్తంగా బాలబాలికల దినోత్సవాలు జరుగుతాయి. ఆంధ్రసచిత్రవారపత్రికను - ఆ రెండు సందర్భాలు పురస్కరించుకుని-నవంబర్ నెలలో 'బాలబాలికల ప్రత్యేక సంచిక'గా వెలువరించాలనుకుంటున్నాము.

వచ్చేవారం సంచికలోపలి, యితర ఆకర్షణలతో పాటు ముఖచిత్ర రచన శ్రీ బాపు చేయడం ఒక విశేషం!

* * *

వాస్తవం, కల్పన కన్నా విచిత్రంగా వుంటుందంటారు! ఈవారం ప్రారంభమైన 'నరకానికి యాత్ర' అనే యదార్థగాథ చదివినప్పుడు పాఠకులకు అలాగ అనిపించవచ్చును. కొందరు పాఠకులు వనితాలోకం పేజీలలో వంటలు వేయడం మాన వద్దని కోరడం చేత వారం వారం యేదో ఒక వంటను వెయ్యడానికే ప్రయత్నిస్తున్నాము!

* * *

'శ్రీ కృష్ణ'గారు ఐరోపా పర్యటనలో వున్నందున ఢిల్లీలేఖ వేయలేక పోయాము. పోతే సమయానికి అంద నందువల్ల 'సరాగమాల' యీ వారం పడలేదు. వచ్చే వారంతో 'మనసున మల్లెలు' కథ పూర్తవుతుంది. కొత్త కథ 'హృదయకుసుమాలు' ప్రారంభమవుతుంది!

## విషయానుక్రమణిక


టి. టి. కృష్ణమాచారి!
కామన్వెల్త్ సమావేశానికి వెళ్లే ముందు
వెళ్లి వచ్చిన తరువాత


అయ్యో! స్వరణ్ సింగ్ కు విదేశాంగ శాఖా? ఏమైనాసరే నేచేసినంత అల గాటు చేయలేడు.


ఉద్యోగాలైనా శాశ్వగా ఉన్నాయా? కాబినెట్ హోదాతో సమానమైన ఏ పదవి కాంగ్రెసు ఇచ్చినా సరే!


బయటికి నడు! ఈ ఆస్తిపాస్తులన్నీ మావి.
కమ్యూనిష్టు పార్టీ ఆస్తిపాస్తులు

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# దీపావళి కథల పోటీ

# ముగింపు తేదీ 1-10-'64

- *నవంబర్ నెలలో వెలువడే ఆంధ్ర సచిత్ర వారపత్రిక తొలి సంచిక దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో ఎప్పటికిమల్లే యీ ఏడాదికూడా 'కథలపోటీ' నిర్వహిస్తున్నాము. మంచి కథలకు మరింత ప్రోత్సాహం యిచ్చే నిమిత్తం బహుమతులను పెంచడంకూడా చేస్తున్నాము.*
- *మొత్తం మూడు బహుమతులుంటాయి. బహుమతి పొందిన కథలకు చెందిన సర్వహక్కులు, ఆంధ్ర సచిత్ర వారపత్రికవై వుంటాయి.*

## మొదటి బహుమతి రు. 900 లు
## రెండవ బహుమతి రు. 500 లు
## మూడవ బహుమతి రు. 350 లు

- ఇతివృత్తం తెనుగు జీవితానికి సంబంధించినదై వుండాలి.
- కథ అరఠావు సైజు కాగితాలపై ఒకవేపు సిరాతో రాసిపంపాలి. పన్నెండు పుటలకు మించరాదు.
- పోటీకి గడువు అక్టోబర్ ఒకటవ తేదీ. అంటే మా కార్యాలయానికి అటుపై చేరిన రచనలు ఎంతమాత్రమూ పోటీకి స్వీకరింపబడవు. తమ తమ రచనలు తిరస్కరింపబడినప్పుడు తిరిగి పొందాలని కోరేవారు తమ రచనలతోనే తగినన్ని తపాలాబిళ్ళలు జతపర్చిన చిరునామాగల కవరులను పంపడం తప్పనిసరిగా భావించాలి.
- పోటీ విషయంలో ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అనువాదాలు, అనుకరణలు పనికిరావు. రచనలు సొంత రచనలైవుండాలి. సంపాదకుల నిర్ణయమే తుది నిర్ణయం.
- ప్రతీ రచయిత తన రచనతోపాటు (1) కలం పేరుతో రాస్తే అసలు పేరు (2) కథ తన సొంతమేనని తెలిపే ఒక జాబూ, పూర్తి చిరునామా విధిగా పంపాలని గ్రహించగోరుతున్నాము. పోస్టేజీ లేని రచనలు ఎంతమాత్రము త్రిప్పి పంపబడవు.
- పోటీలో బహుమతులను పొందిన కథలు మూడూ; నవంబర్ 6 దీపావళి ప్రత్యేక సంచికలో వేస్తాము. పోటీలో బహుమతులను పొందని కొన్ని రచనలను కూడా సచిత్ర వారపత్రిక ఇతర సంచికలలో ప్రచురణార్థం స్వీకరించడం జరిగితే ఆయా రచనలను మామూలు రచనలుగానే స్వీకరించడం జరుగుతుంది. వాటికి యథోచిత పారితోషికం యివ్వడం జరుగుతుంది.
- కవరుపై '<u>దీపావళి కథల పోటీకి</u>' అని స్పష్టంగా రాయాలి. రచనలు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1" చిరునామాకే పంపాలి. వ్యక్తుల పేర్లతో పంపే రచనలు ఎంతమాత్రమూ ఆమోదింపబడవు.

"రఘుకి విదేశం వెళ్లేందుకు స్కాలర్ షిప్పొంచిదట" ఉత్తరం మడిచి టేబుల్ మీద పడేస్తూ చెప్పారు అనంతయ్యగారు.

"అయితే ఇహనేం; అతను ఫారిన్ వెళ్లేందుకుముందే పిల్లనిచ్చి పెళ్ళి కూడా అయిందనిపిస్తేసరి" అంది భార్య.

"అంతే. ఎలాగయినా ఈ లోపలే చేసెయ్యాలి" తేలికగా అనడానికి ప్రయత్నిస్తున్నా, ఆ మాటల్లో దిగులు లేకపోలేదు.

తలుపు చాటున నుంచొని సంభాషణంతా వింటూనే ఉంది సునీత.

సునీతకు తెలుసు తల్లీ, తండ్రీ అలా ఎందుకు మాట్లాడతారో! అసలే డబ్బులేని కుటుంబం. మరి పెద్దదైనఆడపిల్ల పెళ్ళికాకుండాఉంటే తల్లిదండ్రులకి ఎలా ఉంటుంది? రఘు తన బావ. బాగా చదువుకున్నవాడు. ఆస్తిపాస్తులేం లేవు కాని చక్కటి ఉద్యోగం చేసుకుంటున్నాడు. ఎలాగయినా ఈ పెళ్లి జరిపించాలని నాన్న తాపత్రయం.

అందుకే బావ ఎమ్. ఎస్ సి. అయినప్పటి నుంచీ నాన్న ఈ విషయం వ్రాస్తూనే ఉన్నారు. బావ ఉద్దేశ మేమిటో తెలియదు. అత్తయ్య అసలు ఈ విషయమై ఒక్కమాట మాట్లాడదు. ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదంటాడు బావ. బహుశా తనని పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేదేమో. అవునుమరి. డబ్బులేనివాళ్లం. అతను బాగా చదువుకున్నవాడు. చటుక్కున ఓ శుభముహూర్తాన 'నేను మా కాలేజీ లో ఫలానా అమ్మాయిని ప్రేమించాను. ఆమెని తప్ప మరెవరిని చేసుకోను. నన్ను క్షమించవలసింది' అని ఉత్తరమ్ముక్క పడేస్తే అతన్నెవరేం అనగలరు? అలా ఏమయినా అవుతుందేమోనని నాన్నకీ, అమ్మకీ దిగులు. అందుకే, ఆ మనస్సులోని భయాన్ని అణిచి వేసుకోడానికే బంధువులందరి దగ్గిరా ఈ మేనరికం గురించి వీలయినంత హుందాగా చెప్తుంటారు. ఒకటికి పదిమాట్లు 'రఘు చాలా బుద్ధిమంతుడు. తెలివయినవాడు. ఇంతకీ సునీత అదృష్టం.' అని అంటూ, అనుకుంటూ ఉంటారు. పాపం! ఆడపిల్లల తల్లిదండ్రుల కెంత ఆవేదన!

ఆలోచనలతో నిండిపోయిన సునీత అమ్మ పిలుపుకి ఈ లోకంలోకి వచ్చింది.

* * *

అనుకున్నంతా అయింది. 'బెంగుళూర్‌లో తనతోటే కలిసి రిసెర్చి చేసిన అమ్మాయిని వాడు ప్రేమించినట్లూ, తను ఎంత చెప్పినా వినక ఆమెనే చేసుకుంటున్నాడనీ, ఇలా అవుతుందని అనుకోలేదనీ, పెళ్ళికి వచ్చి వధూవరులని తప్పక ఆశీర్వదించమనీ, విచారం ఒలకబోస్తూ ఉత్తరం వ్రాసింది అత్తయ్య.

నాన్న కోపానికీ, దిగులుకీ, ఆవేదనకీ అంతు లేదు.

"వెధవ ప్రేమించాడట. ప్రేమ. ఇన్నాళ్లూ చెప్పలేకపోయాడు. పెళ్లి కెదిగిన కూతుర్ని, వీడి కోసమని ఏ సంబంధం చూడలేదుకదా. మర్యాద లేని మనుషులు. ఛీ! ఛీ!"

తండ్రికోసం చూస్తుంటే సునీతకు ఆపుకోలేని దుఃఖం! కాని ఏం లాభం. పేదవారికోపం పెదవికి చేటు!

"వీడి తాతలాంటి సంబంధం తెస్తాను. ఆ పెళ్ళికి మనం వెళ్ళనేవద్దు."

వెళ్ళకపోతే ఎవరికి బాధ! రావద్దనే వాళ్ల కోరిక కూడా!!

మూడు నాలుగు రోజులదాకా విషాదం రాజ్యం చేసింది ఆ యింట. సునీత చాలా విచారించింది. బావమీద చాలాకోపం వచ్చింది. ప్రేమాలేదూ గీమాలేదు. అంతా అబద్ధం. అసలు వాళ్ళు బాగా డబ్బున్నవాళ్లయి ఉంటారు. ఛీ డబ్బుకి తప్ప ఈ ప్రపంచంలో ఇంక దేనికీ విలువలేదుకదా....... బహుశా బావది తప్పు కాదేమో. అతని పరిస్థితులలో ఎవరయినా అంతే చేసి ఉండేవారేమో. ఎంత బంధువులయినా పరమ దరిద్రాన్ని పెళ్లాడి ఏం లాభం!

ఒక్క వెర్రి నవ్వు నవ్వుకుంది సునీత.

* * *

జరిగిన కథంతా కళ్లకు కట్టినట్లు అవుపిస్తోంది. ఇప్పుడు సునీత అనంతయ్యగారి కూతురు మాత్రమేకాదు. ఎనభై రూపాయలు నెలకి తెచ్చుకుంటూన్న విశ్వనాథం భార్య కూడా. ఈ పాత కథంతా ఇప్పుడు జ్ఞాపకం రావడానికి కారణం—

మధ్యాహ్నం భోజనం చేస్తూ అడిగాడు భర్త.

"పి. రఘునాథరావుగారని నీకు ఒక బావగారు ఉన్నారుకదు"

"అవును" అని తల వూపి, 'ఏం' అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసింది.

"ఆయన అమెరికా వెళ్లారుకదూ?"

"అవునలావుంది ఎందుకీ గొడవంతా? అసలు సంగతేమిటో చెప్పరాదా!"

"నాకు తెలుసులే" అని మర చెంబుతో మంచి నీళ్ళు నోట్లో పోసుకుని—ఇదొక సస్పెన్సు— "ఆయన ఇప్పుడు మా ఫ్యాక్టరీ మేనేజరుగా ఎప్పాయింట్ అయ్యారు" అంటూ భళ్ళున నవ్వాడు.

సునీత గుండె ఆగినట్లయింది.

"చాలా మంచి మనిషిసుమా! నేను ఇలా అని తెలిసి ఎంత ఇదయ్యాడనుకున్నావ్?" బ్రేవున తేనుస్తూ, సంతోషంగా వళ్లు విప్పుకుంటూ చెప్తాడు ఏది చెప్పినా.

"ఏదో ఆయన తలుచుకున్నాడా నాకు ప్రమోషన్ ఇట్టే వస్తుంది. అన్నట్లు చెప్పడం మరిచానేవ్. రేపు నిన్ను తీసుకుని వాళ్లింటికి రమ్మనమన్నారేవ్" పాంటూ, చొక్కా తొడుక్కుని ఆదరా బాదరాగా ఆఫీసుకి పోయాడు.

చాపమీద పడుక్కున్న సునీతకి గతమంతా జ్ఞప్తికి వస్తోంది.

వెళ్లగలదా రేపు తన బావ ఇంటికి? ఎలా వెళ్తుంది? ఇప్పటికి కూడా నాన్న ఆ విషయం తలచుకొని ఎంత బాధ పడతారో!

ఎంత వెళ్లనన్నా భర్త బలవంతంవల్ల బయలుదేరక తప్పలేదు. అది కాకుండా వాళ్ల సంసారం ఎలా ఉందో చూడాలన్న కోరిక కూడా మనసులో లేకపోలేదు. రోడ్డమ్మట నడుస్తున్నారు. చిన్న వాణ్ణి ఎత్తుకుని తనూ, పెద్ద పిల్లని నడిపిస్తూ ఆయనా.

ఇంక ఆలోచనలు. పత్రికలలో, కథల్లో ఎలా రాస్తారో! ఎంత బాగా రాస్తారో! తను అక్కడికి వెళ్లగానే బావ ఆప్యాయంగా పలకరిస్తాడు. భార్యని పరిచయం చేస్తాడు. ఆవిడ పరమ అనాకారి. ధుమలాడుతూ ఉంటుంది మొహం. ఆవిడని చూసి తను మెత్తగా నవ్వుతుంది. రఘు సిగ్గుతో తల వంచుకుంటాడు. తన పిల్లల్ని చూసి రఘు సంతోష పడతాడు.

ఇల్లంతా చూపిస్తూ తోటలో కాస్త ఒంటరిగా ఉన్నప్పుడు,

"సునీ! జీవితంలో ఎంత తప్పు చేశానో ఇప్పుడు తెలుస్తోంది. కేవలం డబ్బుకి ఆశపడి నా జీవితం నరకం చేసుకున్నాను. నీకు తీరని అన్యాయం చేశాను. అందుకే అనుభవిస్తున్నాను." అంటాడు.

తను మృదువుగా "పోనీలే బావా. జరిగిందేదో జరిగింది. ఇప్పుడెందుకవన్నీ" అంటుంది.

అతను కళ్లల్లో నీళ్లు నిండగా అస్పష్టంగా "నువ్వు దేవతవి సునీ" అంటాడు.

చిన్న పిల్లా డెందుకో ఏడుస్తుంటే ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది.

"ఇంకా ఎంత దూరమండీ ఇల్లు" భర్తని ప్రశ్నించింది.

"అబ్బే ఇంకా ఎక్కడా" ఓ అర మైలు నడవాలి అంటూ నడక సాగించాడు.

మళ్లీ ఆలోచనలు. రఘు తన భార్యని చూపించి పరిచయం చేయబోతాడు. ఆమె మరెవరో కాదు తన బాల్య స్నేహితురాలు. ఆనందంతో నువ్వా అని అరుస్తుంది. ఇద్దరూ కావలించుకుంటారు. వాళ్లు స్నేహితులని తెలిసి రఘు ఆశ్చర్య పడతాడు. చిన్ననాటి ముచ్చట్లతో ఆనందంగా గడిచి పోతుంది. ఆ సాయంకాలం.

ఆడంబరాలను విడనాడండి
దేశసంపదను వృథా కానీయకండి



''ఇంటికెళ్లద్దు. ఇక్కడే ఉండి పోమ్మని బలవంతం చేస్తారు'' వాళ్లిద్దరూ.

''తను మరెప్పుడయినా వస్తామని'' చెప్పి వచ్చేస్తారు.

''అదేమిటా పరధ్యానం. ఇటువైపు సందు తిరగాలి'' భర్త హెచ్చరికతో త్రుళ్లి పడింది.

''ఇదే ఇల్లు. పద అలా చూస్తావేం''.

అందమైన భవంతి అది. చుట్టూ చక్కటి పూలమొక్కలతో కళకళలాడే తోట. చాలా నవ నాగరికంగా ఉన్న భవంతి.

కాలింగ్ బెల్ నొక్కగానే నౌకరు తలుపు తీశాడు. రఘుని పిల్చుకొని వచ్చాడు.

''హల్లో నువ్వా విశ్వనాధం. సునీతా వచ్చావా రండి రండి'' ముత్యాల పలువరసలోంచి రత్నాలు రాలిపోతాయేమోనని భయపడుతున్నట్లు మాట్లాడతాడు.

''నీరజా ఎవరో వచ్చారు చూద్దుగాని వేగిరంరా''

పిలుపు వినగానే నాజూకుగా నడుస్తూ తియ్యగా నవ్వుతూ వచ్చిందొకావిడ. ఆమె అనాకారి కాదు! ఎంతో అందగా ఉంది (తనకన్నా కూడా!!) బాల్య స్నేహితురాలు కానే కాదు.

పరిచయాలు అయ్యాక కుర్చీల పై కూర్చుని మాట్లాడుకో సాగారు. వాళ్లిద్దరూ మర్యాద నటిస్తూ మాట్లాడడమూ, చెప్పాలని కాక పోయినా ఏదో సందర్భ వశాత్తు చెప్పినట్లు తమ గొప్పతనాన్ని చెప్పడమూ, వాళ్లిద్దరూ నవ్వుతూ కళ్లతో మాట్లాడుకోవడం. సునీతకి ముళ్లమీద కూచున్నట్లుంది.

తాగడానికి కూల్ డ్రింక్స్ ఇచ్చారు. చిన్నవాడు తాగుతూ మధ్యలో గ్లాసు పడేశాడు. పళ్ల రసం ఒలికి పోయింది.

''అయ్యొయ్యో. కార్పెట్ పాడయి పోయిందే. కాశ్మీరునుంచి నూటయాభయి రూపాయలు పోసి తెప్పించినది'' అని అతను ఆ కార్పెట్ ఖరీదు తెలియజేశాడు.

''పోనీలెండి. చిన్న పిల్లాడు. అలవాటులేదేమో. ఒలికి పోయింది. వెధవది మరోటి కొనుక్కోలేమా!'' అంటు ఆమె తమ గొప్ప తనాన్ని ప్రకటన చేసింది.

సునీతకి తల కొట్టేసినట్లయింది.

పెద్ద పిల్ల డ్రింక్ అయి పోయాక కూడా పీలుస్తోంది.

అప్పుడు ఆవిడ నవ్వుతూ— అందాల రాజకుమారి ఆటవికుడయిన అనాగరికుణ్ని చూసినట్లు నవ్వుతూ ''ఇంక అందులోంచి రసం రాదమ్మా పాపా! అక్కడ పెట్టేయ్'' అంది.

సునీతకి ఒక్కపెట్టున భూకంపం వచ్చి తను అందులో మరణిస్తే బాగుండుననిపించింది.

ఇదిలా ఉండగా భర్త గొడవ అతనిదీ. వచ్చిన దగ్గిరనుండీ ప్రమోషన్... ప్రమోషన్... ఆఫీసులో తనెంతో కష్టపడి పని చేస్తున్నానంటాడు. అందరూ సోమరిపోతులు. తనొక్కడే అందరి పని చేస్తున్నానంటాడు. ఎలాగయినా ఈ ప్రమోషన్ ఇప్పించక తప్పదంటాడు. ప్రతిమాలుతాడు.

రఘు గమ్మత్తుగా నవ్వి, సునీత వంక చూస్తూ ఓడిపోయి బందిగా నిలుచున్న శత్రు రాజువంక గెలిచిన రాజు చూసినట్లు చూసి ''చూద్దాం లెండి. స్కూలు ఫైనలు పాసవని వాళ్లకి ప్రమోషన్ ఇవ్వకూడదని స్ట్రిక్టు ఆర్డర్సు. అయినా ట్రై చేస్తాలెండి.''

తన భర్త స్కూలు ఫైనలు అయినా పేసవలేదని ఎగతాళి చేయడమా ఇది!!

అప్పటికేనా ఆపేయడే ఈయనగారు గొడవ. ఈ ఒక్క సహాయం చేస్తే చాలంటాడు. దీనంగా మాట్లాడతాడు. తమ దరిద్రం గురించి ఏకరువు పెడతాడు.

''ఇంటికెళ్లి భర్తని చెడామడా ఎలా తిట్టెయ్యాలో ఆలోచిస్తోంది సునీత.

ఆఖరికి కబుర్లయ్యాక వెళ్తామని లేచి గుమ్మం దగ్గిర కొచ్చేసరికి—అమ్మో ఆ సంఘటన జన్మలో మరిచి పోలేదు తను.

విశ్వనాధం జోళ్లు కనబడలేదు.

ఆవిడ నౌకరుని పిలిచి 'ఏవిరా ఈ బాబుగారి జోళ్లు' అని గదమాయించింది.

వాడు ''ఆ జోళ్లా అమ్మా! కుక్కేదో వీధిలోంచి పాడయిపోయిన జోళ్లు తెచ్చి ఈడ పడేసిందని అలు తీసి పారేశినానండీ!'' అన్నాడు.

సునీత మొహంలో నెత్తురు చుక్క లేదు!

కాస్తో కూస్తో నవ్వుతున్న విశ్వనాధం మొహం కూడా ఒక్కసారి నల్లగా మాడి పోయింది.

రఘు భార్య మాత్రం చెయ్యరాని తప్పు చేసిన దానిలా బాగా దెబ్బతిన్నట్టుగా మొహం అభినయించ సాగింది.

రఘు పెదవులమీద కనీ కనబడని చిరునవ్వు!! అది ఈతరాని వాడు నదిలో కొట్టుకపోతోంటే నది ఒడ్డున కూచున్న ఈత వచ్చినవాడు నవ్వే నవ్వు! తిండిలేక బీదవాడు ఆశతో నిండిన కళ్లతో చూస్తూంటే నాజూకుగా బిస్కట్లు నోట్లో పడేసుకొనే వాడి నవ్వు!!





''తండ్రి : ఏరా ! మూడు నెలలనుంచి సైకిల్ నేర్చుకుంటున్నావు వచ్చిందట్రా ?''
కొడుకు : ఇప్పుడే నాన్న ముగ్గురికి చేతులు విరగ గొట్టాను. వాళ్ళు మన ఇంటికి వచ్చి సైకిల్ ఎంత బాగా నేర్చుకున్నానో చెప్తామన్నారు నీతో!




## జరిగిన కథ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ళ స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మ గారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికి విశ్వనాథానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తుంది. తోటలో జరిగిన దొంగతనాలకు మధు బాధ్యుడవుతాడు. ఈవిషయాన్ని తెలిసికొన్న విశ్వనాథం మధును రక్తం కారేటట్లు కొడతాడు. దగ్గరి బంధువైన డాక్టర్ కేశవరావ్ పరిచయం మధులో కొత్త ఉత్సాహాన్ని కల్పిస్తుంది. ఉద్యోగంలో చేరిన సూర్యానికి ఆ ఇంటినుంచి విడిపోవటం తప్పనిసరి అవుతుంది. అనతికాలానికే సూర్యం గృహస్థుడవుతాడు. ఇందిర ఆతనికి తగిన భార్య. మధుకు ఇందిర వాత్సల్యం లభిస్తుంది. కేశవ్ మామయ్య రుక్మిణిఅత్తయ్యల మధ్య ఏర్పడిన అగాధం మధులో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

# 14

దారిలో సీతాపతి కన్పించాడు. ఎప్పుడు కన్పించినా మధుని ఆప్యాయంగానే పలకరిస్తాడు. మధు కూడా సీతాపతితో ఇష్టంగానే మాట్లాడతాడు.

మామూలు పలకరింతలు అయ్యాక మధు నవ్వుతూ అన్నాడు — "కృష్ణుడికి తమ్ముడు పుట్టాడట."

"అవున్రా ! మూడ్నెపుగాని రాశ్లాడదూ ?"

మధు చిత్రంగా చూశాడు.

"ఎన్నాళ్ళరా ఈ పంతం ? నీకసికొద్దీ తిట్టావుగా ? ఇంకా దేనికి కోపం ?"

"నాకు కోపమేమిటి మామయ్యా ? అందులోనూ మీ మీద ........ ? అబ్బే !"

"నీ వెటకారాలకేంలేరా ? తిట్టుకున్న వాళ్ళం తిట్టుకున్నట్టే వుండి పోతామా ? ఒక్కసారి రదూ ! సరదాగా కాస్సేపు కూర్చుని వెళ్ళుగాని."

"వస్తాలే. ఇప్పుడుగాదు. మా వదిన నాకోసం ఎదురు చూస్తూ వుంటుంది. బజ్జీలో ఏవో చేస్తోంది. తొందరగా వచ్చెయ్యమంది. — మీ ఇంట్లో వున్నంత కాలం పన్ను లెక్క చెయ్యకపోయినా ఈనాడు నాకోసం మా వదిన ఆహా ఆహా లాడుతోంది సుమా !" — అని మధు మాటలు చెప్పక చెప్తున్నాయి.

సీతాపతి మరేం మాట్లాడలేదు కాస్సేపు. "సరేలే ! నీ యిష్టం వచ్చినప్పుడురా ! నీ పంతం నీదే !" నవ్వాడు.

మధు ఇంటికి వచ్చేసరికి సుందరమ్మ గారూ, సూర్యం, ఇందిరా మాట్లాడుకొంటున్నారు. మధు రాకతో వాతావరణం వుల్లాసంగా మారింది. మాటల మధ్య మధు అన్నాడు — "దారిలో చిన్న మామయ్య కన్పించాడమ్మమ్మా ! వాళ్ళింటికి రమ్మన్నాడు. ఇప్పుడు రానని వచ్చేశాను."

"ఎన్నాళ్ళరా నీకీ తిక్క ? మనలో మనం అనావచ్చు. పడావచ్చు. ఓసారి వెళ్ళి చిన్నత్త కొడుకుని చూసిరా ! బావుంటుంది." అంది సుందరమ్మ గారు.

"ఇదంతా ఉత్త ఆర్భాటం లెద్దురూ ! ఇంట ల్లుడు కదా ? ఆ మాత్రం బెట్టు చేస్తున్నాడు—" నవ్వింది ఇందిర.

"అవును. అదొక్కటే తక్కువ."

"మధూ !" సూర్యం కొంచెం కోపంగా చూశాడు. — "అలా మాత్రం ఎప్పుడూ పెంకితనం చేయకు. ఈ పెళ్ళి జరిగి తీరాల్సిందే."

సుందరమ్మగారు అంది — "మీ అమ్మకు చివరి కోరికలంటూ ఏదైనా వుంటే ఇదేరా ! మీ చిన్నతనంలో జరిగిన గొడవలకీ ఈ పెళ్ళికీ సంబంధం ఏమిటి ? మీరు మీరూ కలిసి మెలిసి వుండాలంటే ఇదొక్కటే దారి."

ఇందిర హాస్యంగా అంది — "ఈ మధుబాబు కబుర్లు నిజమే అనుకుంటున్నారేమిటి ? ఆపిల్లతో ఎప్పుడెప్పుడు మాట్లాడాలా అని తెగ ఆరాటపడి పోతూంటేను."

"చాల్లే వదినా !" మధు కోపం నటించాడు.

సుందరమ్మ గారు మధుని దగ్గిర కూర్చోబెట్టుకుని మామూలు విషయాలన్నీ అడుగుతూ కూర్చుంది. "అయితే నాయనా ! నీ తిండికి హోటలువాడు యాభై రూపాయలు తీసుకుంటున్నాడట... అన్నయ్య చెప్పాడు. నిజమే ?" అంది ఆశ్చర్యంగా.

"అవునమ్మమ్మా ! అంతకన్నా తక్కువుండదు"

"ఎంత వెర్రి సన్నాసివిరా ! నువ్వు తినే మెతుకులెన్ని? పట్టుమని గుప్పెడుండవు."

మధు నవ్వాడు — "అభిమానంతో నువ్వది అంటావు గానీ నేను గుప్పెడు మెతుకులే తింటే గోవిందా కొట్టేద్దును."

"చాల్లే పిచ్చి వెధవా ! గుప్పెడు గాకపోతే మరో గుప్పెడు. అంత మాత్రానికే యాభై రూపాయలా! హోటేలు వాడితో బేరం చెయ్యకూడదూ? — సిగ్గు పడుతున్నావో ఏమో ! ఫర్వాలేదు. కాస్త జబర్దస్తీగా అడిగితే వాడే వచ్చినట్టు ఒప్పుకుంటాడు."

మధు నవ్వు ఆపుకున్నాడు. "అయితే ఎంత ఇవ్వను ?"

"ఇరవై రూపాయలైతే ఇద్దరికి నష్టం వుండదు."

అమ్మమ్మకి నచ్చజెప్పే సరికి తాతయ్య దిగి వచ్చాడు.

సాయంత్రం మధు బయటికి వెళ్దామని బయల్దేరుతోంటే కృష్ణుడు వచ్చాడు — మధు మొదట పోల్చుకోలేక తెల్లబోయాడు —

"ఏంరా అలా చూస్తావ్ ? నేను. వెంకట కృష్ణారావునోయ్ ! పోల్చలా ?" అన్నాడు కృష్ణుడు హాస్యంగా.

"ఓరి ! నువ్వట్రా ? మొన్న ఆర్నెల్ల క్రిందటే చూశాను. ఇంతలో బడా జానెవర్‌లా ఇలా ఎదిగి పోయావేంరా ? ఏమిటీ వేషం ?" మధు సంభ్రమంగా చూశాడలా, కృష్ణుడు కర్రలా పొడుగ్గా ఎదిగి పోయాడు. ఎర్రగా బక్క పల్చగా

గులాబీ తీగలా నిలబడ్డాడు. ఎగదువ్విన క్రాఫింగూ — టకప్ చేసిన షర్టూ — కళ్ళకి మర్మా —

"ఏంరోయ్ ? ఇంత నాజూకు వేస్తున్నావ్ ?"

"ఎన్ని వెయ్యకపోతే పొట్ట నిండుతుందిరా ?"

"ఏమిటి ఇలా దయ చేశావ్ ?"

"తమ దర్శనం కోసం. నీకు జెట్టుగా ? నేనైనా చూసిపోదామని."

"చాలా ప్రేమ పుట్టిందే !"

"నన్నెందుకురా దెప్పుతావు ? మా ఇంట్లో అందరూ నీ కోసం ఎదురు చూస్తున్నారు — నవరణ — మా చెల్లి కాదనుకో."

"ఆ వెర్రి ఎందుకో ?"

"నీ బడాయితో పోటీకి. — నువ్వు వస్తావన్నావటగా ? రాత్రికి భోజనానికి తీసుకురమ్మన్నారు నిన్ను."

"నన్నా ? భోజనానికా ?"

"ఏంరా అంత ఆశ్చర్యం ?"

"కాదూ ? నన్ను మీవాళ్ళు భోజనానికి పిలవటం చరిత్రలో అపూర్వమైన విషయం. ఇంతకీ ఎవరేమిటి నన్ను రమ్మన్నది ?"

"అందరూనూ — అమ్మా నాన్నా పెద్దమ్మా పెదనాన్నా."

"పోరా అబద్ధం ! మీ పెదనాన్న పిల్చాడూ ?"

"నమ్మవేమిట్రా ? పెదనాన్నకి నీమీదేం కోపం లేదు."

"ఉండనీవోయ్. ఎవడికి నష్టం ?"

సుందరమ్మగారు మధ్యాహ్నం నిద్ర మేలుకొని లేచింది. "ఎవరూ ? కృష్ణుడొచ్చినట్టున్నాడే !" అంటూ బయటి కొచ్చింది.

"చూడు నాయనమ్మా ! వీడు మన ఇంటికి రమ్మంటే బెట్టు చేస్తున్నాడు." ఫిర్యాదు చేశాడు కృష్ణుడు.

"అదేమిట్రా మధూ ? ఎప్పటికప్పుడు మర్చిపోవాలిగానీ ఇంత పట్టుదలా ? వెళ్ళి వోసారి అందర్నీ చూసిరా. వెంట వుండి తీసికెళ్ళరా కృష్ణా !"

మధుకి చిరాకు వేసింది. [illegible]

"దానికేం గాని నువ్వు ఈసారన్నా పరీక్షలు సరిగా రాశావురా కిష్టిగా ?" అన్నాడు నవ్వుతూ.

"ఆ పోనిద్దూ ! సప్లిమెంటుకీ నాకీ అవినాభావ సంబంధం వుంది."

"నువ్వు కూడా బుద్ధిగా చదువుకోటం లేదూ ?"

"నా చదువుకేంగాని మా సుధని బాగా చదివిస్తుంరా !" కృష్ణుడు మధుకేసి చూశాడు.

"మీరు చదివిస్తారా ? అది చదువుతుందా ? — అహ ! వారికే అడిగావనుకో !"



"నీ కబుర్లకేంగాని ఇంతకీ వస్తావా ? రావా ?"

"మీ తమ్ముణ్ణి చూడాలి. వస్తాను. అంతేగాని భోజనం గీజనం — ఖాతాన్లె."

"నిన్ను లాక్కుపోవటమే నాడ్యూటీ ! తర్వాత వాళ్ళేదో తగలడతారు."

ఇల్లు దాటనిచ్చి మధు జేబులోంచి తీసి సిగరెట్ ఒకటి కృష్ణుడి కిచ్చి తనూ అంటించాడు.

"ఇదెప్పటినుంచిరోయ్ ! మ ప్పు బు ద్ధి మంతుడివిగా ?"

"ఇప్పుడు కాదు ?"

"మా ఇంటి దగ్గర కాల్చకు సుమీ ! పెదనాన్న చూస్తే తన్ను గలడు."

"తన్నుకో గలడు. మనలో మనమాట. నువ్వు కాల్చవూ ?"

"మనలో మనమాట. నేనూ కాలుస్తాలే. రహస్యం."

"ముందు తోటలోకి పోదాంరా. చూసి చాలా రోజులైంది."

"నోరు మూసుకొని పదరా ఇంట్లోకి. తోట షికార్లు తర్వాత."

వీధి మెట్లెక్కుతుంటే మధు శరీరం కంపించింది. అర్థంగాని అనుభూతేదో ఆవరించింది. ఆమెట్లు దిగి రెండు సంవత్సరాలునాటి పోయాయి. ఇంత సామరస్యంగా తిరిగి వస్తానని కలలో కూడా అనుకోలేదు తను — చావిట్లో సావిత్రి చంటివాణ్ణి త్ముకు నించుంది. రాధ మరో స్నేహితురాలితో బొమ్మలాడు కుంటోంది.

సావిత్రి సంతోషంగా సంభ్రమంగా చూసింది. "ఎంతవాడివై పోయావయ్యా ! దొరబాబులా తయారయ్యావే !" అంది.

మధుని చూసిన వాళ్ళందరూ ఆశ్చర్యపడటంలో అర్థం లేక పోలేదు. పచ్చగా సూర్యకిరణంలా

# కూలిన గోడలు

ఆకతాయిగా తిరిగే మధు — బలిష్ఠమైన అవయవాలతో హుందాగా కనిపిస్తాడు. కళ్లల్లో ఆ చురుకుతనం వడకలో తీపీ — మాటల్లో గాంభీర్యం మధు అలంకారాలు. చదువు నేర్పిన సంస్కారం మధు ప్రవర్తనలో పువ్వు నుంచి వెలువడే తావిలా అనుభవ మౌతుంది.

మధు అంతకాలానికి సావిత్రిని చూస్తుంటే ఏమీ మాట్లాడలేక పోయాడు — మౌనంగా చంటివాణ్ణి అందుకున్నాడు—"కృష్ణుడి పోలికే అత్తా!"

సావిత్రి నవ్వింది—"నిలబడే వున్నావు కూర్చో."

"పెద్దత్త లేదా ?" పొడిగా అడిగాడు మధు.

"దొడ్లో ఏదో చేస్తున్నట్టుంది. వస్తుందిలే. కూర్చో." సావిత్రి చంటివాణ్ణి అందుకుని గదిలోకి వెళ్లింది.

"రాధా !" మధు తనకేసే వింతగా చూస్తున్న రాధని పిల్చాడు — "ఇలారా !"

రాధ సిగ్గుతో తుర్రుమని పరిగెత్తింది. మధు ఇల్లంతా కొత్తగా చూడ సాగాడు.

"సుధ కోసమా బావా ?" కొంటెగా అన్నాడు కృష్ణుడు.

"నీ హాస్యాలకేంగానీ నా కేమిటో బాగా లేదురా!"

"ఏం ?"

"ఏమిటో మనసంతా గందరగోళంలా వుంది." మధు అప్రయత్నంగా సిగరెట్ ముట్టించాడు.

"కృష్ణా ! మధు వచ్చాడటగా ?" — విశ్వనాథం కంఠం వినిపించింది — విశ్వనాథం వచ్చే లోపునే మధు సిగరెట్ కుర్చీ క్రిందికి విసిరేశాడు.

"నిజంగా పెదనాన్నంటే నీకు భయమేనేమిటా ?"

"ఏదో కాస్త భక్తి వుందిలే."

విశ్వనాథం వస్తూనే కుర్చీ కింద పొగలు కక్కుతూన్న సిగరెట్ చూశాడు —

"ఓహో ! చాలా పెద్దవాడివై పోయావ్ !"

మధు ఏమీ మాట్లాడలేదు. చివరిసారి ఘర్షణపడిన మామయ్యతో ఇన్నాళ్లకేం మాట్లాడాలో తెలీలేదు — "ఏంరా అలా చూస్తావ్ ?"

"ఇంకెలా చూడాలి మామయ్యా ?"

"నీకీ తల తిరుగుడు తలతోపాటు పోవాల్సిందే."

సీతాపతీ పార్వతీ కూడా వచ్చారు. పరామర్శలూ వగైరా ముగిశాయి — సుధ మాత్రం ఎక్కడా కన్పించలేదు.

ఏవో మాటల మధ్య విశ్వనాథం అన్నాడు — "మా సుధని డాక్టర్ చదివిస్తాం రా !" ఆ మాటల్లో గర్వం — వ్యంగ్యం అర్థమయ్యాయి మధుకి.

తాపీగా అన్నాడు — "ఓ.హో !"

సీతాపతి ఒక రకంగా చూశాడు. — "ఏం ? నీ కిష్టం లేదా ?"

మధు నవ్వాడు. — "అదేమిటి మామయ్యా ? చదివేది నీ కూతురూ — చదివించేది నువ్వూ — చదువు చెప్పేది మరొకళ్ళూ ! మధ్య నాయిష్ట మేమిటి"

"నేను చెప్పలేదూ ? వీడికి తలతిరుగుడు తగ్గలేదు." విశ్వనాథం అదోరకంగా నవ్వాడు.

మధు విశ్వనాథాన్ని అనేక విధాల పరికించాడు. ఆ మనిషిలో తన మీద అభిమానం వున్న సూచనలు మధు కెక్కడా కన్పించలేదు —

"తల తిరుగుడూ కాదు. ఏమీకాదు. మామయ్యా ఆ మాత్రం ఆట పట్టించవద్దా ఏమిటి ?" పార్వతి రెండు వెండి ప్లేట్లలో ఏవో ఫలహారాలు తెచ్చి మధు ఎదురుగా పెడుతూ అంది. — "తినవయ్యా ! చాలా రోజులైంది మా చేతులతో పెట్టి."

"ఏమిటిదంతా ?" తనకు జరుగుతూన్న సత్కారం ఆశ్చర్యం కల్గించింది మధుకి. ఇంట్లో వాళ్ళంతా ఇంత సడన్‌గా మారిపోయారేమిటి ? ఈ పలకరింపులూ ఈ మర్యాదలూ గమ్మత్తుగా వుందే !

"తినరా మధూ !" అల్లుడి కేసి చూశాడు సీతాపతి.

"నీకు కాఫీ కూడా అలవాటు కాబోలు. తయారవుతుందిలే." — విశ్వనాథం కుర్చీలో జేరబడ్డాడు.

"మీ కింత శ్రమ అక్కర్లేదు మామయ్యా ! ఇప్పుడే మా వదిన ఉప్మా చేసి పెడ్తే కడుపునిండా తిని వచ్చాను. మరేం ముట్టుకోలేను."

పార్వతి కొంచెం నిష్ఠూరంగా అంది — "మీ వదినలా మేము ప్రేమతోనే పెట్టాంలే."

"ఇంతమంది ప్రేమలు భరించే శక్తి నాకు లేదులే అత్తా !" — మధు ఫలహారాలేమీ ముట్టుకోలేదు. — "ఇంటికి వచ్చినా పంతంగానే వున్నావేమిటీ ?"

మధుతో వాదన పెంచుకోవడం ఇష్టంలేక సీతాపతి లేచాడు — "అలా తోటలోకి వెళ్దాం వస్తావా ?"

"ఒరేయ్ !" విశ్వనాథం పిలుపుతో తల తిప్పి చూశాడు మధు.

41వ పేజీ చూడండి



"నీ సత్ప్రవర్తనకు మెచ్చి నీ శిక్ష తగ్గించారు. ఇవిగో నీపేనా, వాచీ. ఇక నీవు ఇంటికి వెళ్ళవచ్చు."

"అవి మీదగ్గర్నే వుంచండి సార్. మళ్ళీ నేనెలాగూ వస్తాను కదండీ!"

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ:

"సుఖపడదామని
కొడుకు
యింటికి వెళ్లినా
నా వంటపని
నాకు
తప్పలేదు!"

మా అబ్బాయిని, కోడలు సీతను చూచి రెండేళ్ల అయిందేమో, వాళ్లను చూడడానికి నన్ను రమ్మని వ్రాసిన ఉత్తరము అందగానే ఎంతో సంతోషించేను. కొన్నాళ్లయినా సుఖంగా కాలక్షేపం అవుతుందనుకొన్నాను. కాని వాళ్ల యింట్లో కాలు పెట్టగానే నా కోర్కెలు పటాపంచలయేయి. సీత పూర్వంలా చురుకుగా లేదు. ఇల్లంతా చిందరవందరగా కనిపించింది. పిల్లలు చింపిరి జుట్టుంతో ప్రత్యక్షమయేరు. నాకు యిక్కడా పనిచేయడము తప్పలేదురా భగవంతుడా అనుకొన్నాను!



ఒక రోజున మా అబ్బాయిని పిలిచి అడిగేను "అబ్బాయ్, మన సీతకు ఏమయిందిరా?" వాడు ఏమీ చెప్పలేదు. కాని కొన్ని రోజులు పోయేక సీత నాతో యిలా అంది "అత్తయ్యా, నాకేమీ పాలుపోకుండా ఉంది. ఒంట్లో ఓపిక లేక ఏ పని చేసుకోలేకుండా ఉన్నాను. నాకు ఏమి చేయాలో తెలీకుండా ఉంది." పాపం, దాన్ని చూస్తే జాలివేసి "పదమ్మా, నిన్ను డాక్టరు దగ్గరకు తీసుకువెడతాను." అన్నాను.



డాక్టరు దగ్గరకు మేము వెళ్లడమూ మంచిదే అయింది. ఆయన అన్నీ కనుక్కొని యిలా అన్నారు. "పరవాలేదండి. ఒంట్లో జబ్బు ఏమీ లేదు. ఈమెకు కావలసినంత పోషణ లభించడములేదు. అందుకనే ఈమె త్వరగా అలసిపోతోంది. రోజూ హార్లిక్స్ త్రాగితే బాగుంటుంది."





హార్లిక్స్ త్రాగి కొన్ని వారాల్లో సీత మళ్ళీ ఉత్సాహముగ కనబడింది. గోధుమ పిండి, మాల్టెడ్ బార్లీల పోషణతో కూడిన శ్రేష్ఠమైన డెయిరీ పాలతో హార్లిక్స్ తయారవుతుంది. మా అత్తగారి చిన్నతనమునుండే రోగులకు, రోగమునుండి కోలుకొంటున్న వారికి బలానికని హార్లిక్సును డాక్టర్లు వాడమనడము నాకు తెలిసినదే. హార్లిక్స్ తప్పకుండా పనిచేస్తుంది!




# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

సంసారమంటే స్వర్గమనుకున్న అభాగ్యురాలి గాథ

# నరకానికి ప్రయాణం!

కథనం డెరెక్ ఈవ్

## అడవుల్లో బానిసగా ఉన్న వనితని విడిపించాను!

ఇప్పుడే 14000 మైళ్ళ ప్రయాణం పూర్తిచేసుకుని లండన్‌కి తిరిగి వచ్చారు. ఈ ప్రయాణం జెట్ విమానంమీద, జీప్‌మీద, కాలి నడకమీదా చేశాను. తన పాకిస్తానీ భర్త బానిసగా అడవుల్లో ఉన్న ఒక కుగ్రామంలో, గుడిసెలో అష్ట కష్టాలూ పడుతున్న ఒక బ్రిటిష్ వనితని ఆ మె చెరనుండి విడిపించాను.

ఒక మేజస్ట్రేట్, కొందరు సైనికులు— వీరి సహాయంతో నా కార్యం నెరవేరింది. నేడు ఈ స్త్రీ తన నలుగురు పిల్లలలో ముగ్గురితో లండన్‌లో సురక్షితంగా ఉంది.

అయిదేళ్ళ తర్వాత నరకయాతన నుంచి బయట పడింది. భర్త హింస తప్పించుకోగలిగింది.

ఆమె పేరు శ్రీమతి ఇవిలెన్ ఆలం, ఆమె వయస్సు 37. కాని పడిన కష్టాలు ఆమెని ఏభయి సంవత్సరాల దానిగా మార్చేసినట్లు కనిపిస్తాయి.

ఆమె కళ్ళారా ఇద్దరు పిల్లలు కలరా వాత పడటం చూసింది.

తన భర్త పునర్వివాహం చేసుకుంటే సహించి పూరుకుంది. (ఇది ముస్లిం చట్టం కింద తప్పు కాదు.)

అనారోగ్యం, సరయిన ఆహారం లేక పోవటం ఆమెని ఇంచుమించు ఆత్మహత్యకి ప్రేరేపించాయి.

ఆమె ఆవేదనంతా ఇంగ్లండ్‌లోని తన అన్న శ్రీ విలియమ్ డేవిస్‌కి రాసిన ఉత్తరాలలో స్పష్టంగా కనిపించేది.

చివరచివరికి ఆమె ఆత్మహత్య తీర్మానాలు తీవ్రం అవటం చూసిన శ్రీ డేవిస్ ఉండపట్టలేక తన నియోజక వర్గం శాసన సభ్యుడి సహాయం అర్థించాడు.

శ్రీ డేవిస్‌కి ఆమె తిరుగు ప్రయాణం ఖర్చులు పెట్టుకునే స్తోమతులేక పోవటం వల్ల ఏదీ కుదర లేదు.

ఇక చేసేదేమీ లేక మా పత్రిక (పీపుల్— People) సహాయం కోరాడు. తన సహోదరి దీనగాథ వివరించాడు.

19 సంవత్సరాల క్రితం, బర్మింగ్‌హాంలో ఆమె 'లాల్ ఆలం' అనే అతన్ని పెళ్ళి చేసుకుంది. వాళ్ళిద్దరూ బర్మింగ్‌హాంలోనే ఎడ్గ్ బాస్టన్‌లోనూ, హాక్లీలోనూ కలిసి కాపురం చేశారు.

ఆలం మోటారు మెకానిక్‌గా పని చేస్తూ వారానికి 20 పవున్లదాకా సంపాదించేవాడు. (ఇంచుమించు 265 రూ.)

అప్పుడప్పుడూ పాకిస్తాన్‌లో తన కున్న భూముల గురించి గొప్పలు చెప్పుకునే వాడు. ఇంగ్లండ్ వదిలి అక్కడికి వలస వెళ్ళి పోదామనే వాడు.

చివరికి అతని మాట నెగ్గింది. గర్భంతో ఉన్న శ్రీమతి ఆలం పిల్లలతో ముందు పాకిస్తాన్ వెళ్ళింది. భర్త కొంచెం ధనం కూడబెట్టుకున్న తర్వాత వస్తానన్నాడుట.

అది శ్రీమతి ఆలంకి నిజంగా నరక ప్రయాణమే. 'భూములు' ఒక కుగ్రామంలో గుడిసె కన్నా పెద్దవి కావని తేలిపోయింది.

భర్త చుట్టాలని తన ఇల్లు ఏదని అడగ్గా, గుడిసెముాల ఒక వాటా చూపించారు. నేలమీదనే పడుకోవలసి వచ్చింది, అలవాటు లేకపోయినా.

మూడున్నర సంవత్సరాలు శ్రీమతి ఆలం ఆ పల్లెటూరిలో నరకయాతన అనుభవించింది— భర్త బర్మింగ్‌హాంలో సుఖంగా బ్రతుకుతూ ఉండగా.

ఇంగ్లండ్‌కి తిరిగి వచ్చేస్తానంటే వినేవాడు కాదు, ఎప్పుడయినా కొంత డబ్బు పంపేవాడు, అదీ ముఖ్యావసరాలకి సరిగ్గా సరిపోయేది.

ఆమె ఒక ఖైదీ అయిపోయిందన్న మాట, పుట్టింటికి 7000 మయిళ్ల దూరంలో, పులులు విహరించే కారడవిలో....

ఇదంతా నేను మీకు చెప్పేందుకు 15 నెలల క్రితం శ్రీ ఆలం తన వూరికి తిరిగి వచ్చేశాడు.

అంతవాకా అతని భార్య బ్రతుకు కష్టంగానే ఉండేది. అతని రాకతో నరకయాతన అధికమయింది. ఖైదీ నుంచి బానిసగా మారిపోయింది.

భార్య తన అన్నగారికి ఉత్తరాలు వ్రాసిందని తెలియగానే ఆమెని బాదేవాడు. ఢక్కా (తూ. పా. ముఖ్యపట్టణం)లో బ్రిటిష్ హైకమిషనర్‌కి కూడా వ్రాసిందని తెలుసుకుని ఇంకా చావకొట్టేడు.

ఉత్తరాలేవి వ్రాయటానికి వీల్లేదని శాసించాడు. గుడిసెలోనే ఖైదీగా ఉంచేశాడు.

అతను మళ్ళీ వివాహం చేసుకున్నాడు— ఒక 22 ఏళ్ల అమ్మాయిని. అప్పుడే ఆమె ఖైదీ నుంచి బానిసగా మారిపోయింది.....

ఈ విషయాన్నీ తెలుసుకున్న మా పత్రిక అధిపతులు **శ్రీమతి ఆలంకి సహాయం చెయ్య**



ఇలాంటి దారుణ పరిస్థితులలో ఆమె ఐదేళ్లు యమబాధలకు గురియైంది.

**భార్యగా సర్వ సౌఖ్యాలు అనుభవించాలనుకుని, పాకిస్తానీని పెళ్ళాడి బందీగా మారి పాకిస్తాన్ అనే 'నరకం' లో యమయాతనలు అనుభవించి, అష్టకష్టాలు పడ్డ ఇవిలెన్ ఆలమ్ అనే బ్రిటిష్ వనిత (విచిత్ర) యదార్థ గాథలో తొలిభాగం.**



వేల్స్‌కు చెందిన యీ వనిత పేరు ఇవిలిన్; ఈమె ఆలమ్ అనే పాకిస్తానీని పెళ్ళాడి అష్టకష్టాలూ సంవత్సరాలుగా అనుభవించింది.

తెలుసుకున్నారు. ఆమెసోదరుడు శ్రీడేవిస్ ప్రయాణం ఖర్చులు భరించలేని స్థితిలో ఉన్నాడు.

అందుకుని మేమే ఆ ఖర్చులు పెట్ట నిశ్చయించు కున్నాము. నేను పాకిస్తాన్‌కి విమానంలో వెళ్ళాను.

అది ఒక పెద్ద ఉద్యమం అయి పూరుకుంది. అపాయాలు, విభ్రాంతి కొలిపే సంఘటనలూ ఎదుర్కొన్నాను.

ముందు ఢక్కాలోని బ్రిటిష్ హైకమిషన్ ఆఫీసుకి వెళ్ళాను.

అక్కడ వారికి నాలుగేళ్ళుగా శ్రీమతి ఆలం దుస్థితి తెలిసినప్పటికీ ఆమె సహాయానికి వెళ్ళలేదని తెలుసుకుని ఆశ్చర్యపోయాను.

అసలు ఆమె ఉండే గ్రామం— సదర్ ఘాట్— ఎక్కడుందో వారికి సరిగా తెలియదుట ! సిల్‌హట్ జిల్లాలో ఎక్కడో ఉందని మాత్రం ఎరుగుదురుట !

నా నిశ్చయం తెలుసుకుని ఆ జిల్లా కమిషనర్‌కి ఉత్తరం ఇచ్చారు అధికారులు.

సిల్‌హట్‌లో సదర్‌ఘాట్ దారి చెప్పారు. హబిగంజ్‌కి రైల్లో వెళ్ళి, అక్కడ నుంచి సదర్ ఘాట్ 50 మైళ్ళ దూరంలో ఉందని తెలుసుకున్నాను.

ఈ ఏభయి మైళ్ళు 500 కన్నా దూరమయినవి.

ప్రయాణం మళ్ళీ జీప్‌లో మొదలు పెట్టాను.

మూడు మైళ్ళ తర్వాత రోడ్డు ఆగిపోయింది. ఆ పైన గతుకులనేల మీద అతి నెమ్మదిగా, అతి ప్రయాసతో ముందుకి నెట్టుకుంటూ వెళ్ళాము.

చివరికి ఈ దారికూడా ఒక ఎండి పోయిన వాగు దగ్గరకు వచ్చి ఆగిపోయింది. వాగుమీదుగా దారి తవ్వాలని సూచించాడు మా డ్రయివర్. (అతనికి ఇంగ్లీషు రాదు కాబట్టి రెండు పారలతో తగిన సంజ్ఞలు చేశాడు.

ఇలా ఆరుసార్లు ఆరు వాగులలో నుంచి మా దారి మేమే తవ్వుకుంటూ వెళ్ళాము.

సాయంత్రం 6—30కి జీప్ అసలే ఆగిపోవల్సి వచ్చింది. తక్కిన ఆరు మైళ్ళకీ కాలినడకే శరణ్యమయింది.

ఎక్కడి నుంచి వచ్చారో మా చుట్టూ మనుష్యులు గుమిగూడారు. చెట్లలోపల కొన్ని గుడిసెలున్నాయి. వాటిని మేము సరిగ్గా చూడలేదు....

సదర్‌ఘాట్‌కి తీసుకు వెడతానని ఒకతను ముందుకి వచ్చాడు.

రెండు గంటలు అడవిలో నడిచాము. చీకటి పడిపోయింది. హటాత్తుగా ఒక మట్టిగోడ ఎదురయింది. ఆ గోడ కవతల అయిదారు మట్టి గోడల గుడిసెలు కనిపించాయి. ఇదే శ్రీమతి ఇవిలెన్ ఆలం గృహం.

ఇరవయి ముప్ఫయి మంది మమ్మల్ని చుట్టుముట్టారు. నాకు భయం వేసింది !

శ్రీ ఆలం కావాలన్నాను. ఒక గుడిసెలో నుంచి అతను వచ్చాడు.

లుంగీ కట్టుకుని ఉన్నాడు. అతనే ఆలం.

ఇతను 19 ఏళ్ళు ఇంగ్లండ్‌లో ఉన్నాడు. ఇక్కడ ఏదో కాలేజీలో చదువుకున్నాడు. ఉద్యోగం చేశాడు.

అయినా ఆ జీవితం వదిలి స్వగ్రామంలో రైతు జీవితం ఎన్నుకున్నాడు.

నే వచ్చిన పని చెప్పి శ్రీమతి ఆలంని చూడాలన్నాను.

శ్రీమతి ఆలం నన్ను చూసి నిర్ఘాంత పోయింది. తన దేశం నుంచి వచ్చిన మరొక వ్యక్తిని చూసి తన కళ్ళని తనే నమ్మలేక మూర్ఛపోయింది.

ఆమె తెప్పరిల్లగానే తిరిగి తన దేశానికి తీసుకుపోవటానికి వచ్చానని చెప్పాను.

నమ్మలేనట్లు నావైపు గుడ్లురిమి చూసింది. ఆపుకోలేక ఏడ్చింది.

వెంటనే తీసుకు పొమ్మంది. భర్తని కూడా వేడుకుంది. ఆలం వీల్లేదన్నాడు.

"ఇక్కడ నా మాటే శాసనం." అన్నాడు.

చుట్టూ మూగి ఉన్న వారిని చూపించి, "బలవంతం మీద సాధిద్దామనుకుంటున్నావా ?" అని అడిగాడు.

అది జరగని పని, అని గ్రహించాను.

శ్రీమతి ఆలంతో తిరిగి వస్తానని చెప్పాను. ఆమె గొల్లుమంది.

ఆమె 16 ఏళ్ల కొడుకు హమీద్ ఆమెకి ధైర్యం చెబుతూ ఉండే దృశ్యం చూస్తూనే ఆమెని సముదాయ పరిచాను.

హబిగంజ్ చేరుకునే సరికి ఉదయం 6 గంటలయింది.

ఢక్కాకి వెళ్ళి బ్రిటిష్ హైకమీషనర్ వాళ్ళతో జరిగినదంతా చెప్పాను. శ్రీమతి ఆలంని రక్షించాలని నొక్కి నొక్కి చెప్పాను.

"త్వరపడకపోతే ఆమె ప్రాణాలు కూడా దక్కవేమో !" అన్నాను.

"పాకిస్తాన్ ప్రభుత్వం సహాయం పొందకపోతే లాభం లేదు." అన్నాడు అక్కడ కార్యదర్శి శ్రీ జాఫ్రీయండ్.

"ఆంతరంగిక వ్యవహారాల శాఖ సహాయం కోసం అర్థిస్తాను." అన్నాడు.

మూడు రోజులు గడిచాయి. ఇక ఉండబట్టలేక సిల్‌హట్‌కి వెళ్ళి స్వయంగానే పాకిస్తానీ డిప్యూటీ హైకమిషనర్‌ని కలుసుకున్నాను.

అతను నావెంట ఒక మేజిస్ట్రేట్‌ను పంపాలని ఉత్తరువు జారీచేస్తూ ఒక ఉత్తరం హబీగంజ్ సబ్— డివిజనల్ ఆఫీసర్‌కి వ్రాశాడు.

"పోలీసు అధికారులని కూడా కలవండి," అని చెప్పాడు.

హబీగంజ్‌లో పోలీసు అధికారిని కలిసి, ఒక మేజిస్ట్రేట్‌ని వెంట బెట్టుకుని, ఇద్దరు భటులతో బయలు దేరాను.

రాత్రికి గ్రామం చేరుకున్నాము.

ఆలంతో గంటసేపు వాదించి ఒక ఒప్పందానికి వచ్చాము— మొదటి కొడుకు హమీద్‌ని మాత్రం తను ఉంచుకుంటాడు, తక్కిన ముగ్గురు పిల్లలనీ వదులుకుంటానన్నాడు.

శ్రీమతి ఆలం హమీద్ వద్ద తీసుకున్న సెలవు దృశ్యం ఎటువంటి కఠినాత్ముడినయినా కదిల్చివేసేది.

మళ్ళీ అతన్నెప్పుడయినా చూడగలనా అనుకుంటూ ఉంటుంది. ఏమో ఎవరు చెప్పగలరు? ఆ విషయం వదిలెయ్యండి.

ఢక్కా చేరుకున్నాము. రైలు ఎక్కాము. అప్పటిదాకా శ్రీమతి ఆలంకి తను స్వేచ్ఛావ్యక్తినని నమ్మకం కుదిరినట్లు లేదు.

"నమ్మలేకుండా ఉన్నాను," అంది మళ్ళీ, మళ్ళీ.

ఢక్కాలో ఒక మంచి హోటల్లో దిగాము. నాగరిక ప్రపంచంలోని సౌకర్యాలన్నీ తిరిగి చవి చూడగలిగిన శ్రీమతి ఆలం వేరే మనిషి అయిపోయింది. తన కథ కొంత చెప్పింది.

"ఆ పల్లెటూరిలోనే చచ్చిపోతాననే భయం

# నరకానికి ప్రయాణం

పట్టుకుంది. అక్కడే నా రక్తం పంచుకున్నవాళ్లెందరో పోవటం చూశాను.

"అక్కడ జీవితానికే విలువలేదు. ప్రాణం పోగానే పాతేసి అంతా మర్చిపోతారు.

"కొందరికి మరణమే విముక్తిగా ఉంటుంది. ఎందుకో అన్ని ఆశలూ ఉడిగిన తర్వాత జీవితం, ఎంతో ప్రియమయినదిగా తోస్తుంది."

శ్రీమతి ఆలం నా చేతులు పట్టుకుని, "మీపత్రికా, మీరూ చేసిన మేలు ఎన్నటికీ మరువలేను." అంది.

ఇప్పుడామె తన దేశంలో తన వారి మధ్య ఉంది. తనను రక్షించిన సోదరుడితో కలిసి ఉంటోంది. అతనూ అన్నాడు. "మీకెంత ఋణపడి ఉన్నానో చెప్పలేను!" అని.

కాని— ఈమెని రక్షించటానికి ఒక పత్రిక వెళ్లాలా?

ఆమె ఒక బ్రిటిష్ పౌరురాలు. పాకిస్తాన్‌లో ఆమె దేశ ప్రతినిధులు ఏమిచేస్తున్నట్లు?

ఈ విషయం అక్కడ హైకమీషనరుతో చర్చించాను. ఆమె తనంతటతానే వచ్చింది, కనుక తాము చేసేదేమీ లేదన్నాడు— ఆమె ప్రయాణం కర్చులు ఎవరయినా భరిస్తే తప్ప.

ఇంగ్లండులో అధికారులూ ఇదే మాటన్నారు.

ఒకటి మాత్రం చెప్పనియ్యండి, నా దీక్ష గుర్తించిన తర్వాత ఢక్కా హైకమీషన్ ఆఫీసువాళ్లు అన్నివిధాలా సహకరించారు.

శ్రీమతి ఆలంకి— ఆమె పిల్లకి కొత్త జీవితం ప్రారంభించనుంది. వారికి మనందరి శుభాకాంక్షలూ అవసరం. (సశేషం)



సంవత్సరాల క్రితం విడిపోయిన తల్లీ కూతుళ్ళు తిరిగి కలుసుకున్న దృశ్యం. కాని దీని వెనుక కథ చాలా వుంది! అదే మీరు చదువుతారు.

# వంకాయతో రకరకాలు!

## వంకాయ తొక్కు

వంకాయలను ముక్కలు ముక్కలుగా కోసుకోవాలి. మూడు సేర్ల వంకాయలకు 1 శేరు చింతపండు 1 పావు కారం, ½పావు ఉప్పు తీసుకోవాలి. చింతపండు, కారం, ఉప్పు అంత బాగా సన్నగా దంచాలి. అంతా కలిసిన తరువాత తగిన ముక్కలు వేసి కొద్దిగా దంచాలి. దీనిని ఒక జాడీలో కాని కళాయి ఉన్న పాత్రలో కాని ఎత్తిపెట్టాలి. 15 రోజుల తర్వాత ఈ ముక్కలంతా బాగా వూరి మామిడి ముక్కల వలె తయారవుతవి. మనకు కావలసినంత తీసుకొని దానికి తగినంత నూనె కాచి ఆవాలు వేసి ఈ తొక్కులో వేయాలి. కొంత సేపటికి రంగు వచ్చి ఆవకాయవలె ఉంటుంది. ఇది ఆరు నెలల వరకు నిలువ ఉంచవచ్చు. దోసె, ఇడ్లీలకు అన్నిటికి బాగా ఉంటుంది.

## వంకాయ మిరపపొడి

వంకాయలు ముక్కలు ముక్కలుగా తరగాలి. వీటికి తగినంత నూనెవేసి ఆవాలు వేయాలి. అది బాగ చిటపటా అన్న తరువాత ఈ ముక్కలు వేసి పైన మూత పెట్టాలి. ఈ ముక్కలు బాగా వేగిన తరువాత ఉప్పు, కారం, కొబ్బరి, కొద్దిగా పసుపు వేసి బాగ సన్నగా దంచి దానిలో వేయాలి. అన్నంలోకన్న చపాతి, పూరిలలో బాగ ఉంటుంది.

## వంకాయ బోండ

చిన్నచిన్న వంకాయలు అంటే నిమ్మకాయ సైజులో కూడ వస్తవి. అటువంటివి లోపల విత్తనాలు లేనివి లేతవి తీసుకోవాలి. దాని కాడలు సరిగ్గా సగానికి తీసివేయాలి. ఒక్కొక్క వంకాయను నాలుగు ముక్కలుగా చీల్చాలి అంటే ముక్కల వేరు చేయరాదు. బాణలిలో నూనె వేసి, అది బాగ కాగిన తరువాత ఈ తరిగిన వంకాయలు వేయాలి. అవి బాగా మెత్తపడ్డ తరువాత బయటికి తీసి అందులో, కారము, ఉప్పు, కొబ్బరి, జీలకర్ర కొద్దిగా వేసి పొడికొట్టి నించాలి. ఈ నించిన వంకాయలు ఒక ప్రక్క ఉంచుకోవాలి. సెనగపిండి నీళ్లలో కలిపి ఉంచుకోవాలి. దీనిలో కొద్దిగా సోడాపొడి వేయాలి. వేస్తే బోండా బాగా ఉబ్బుతుంది. ఈ పిండిలో వంకాయలు అద్ది నూనెలో వేయాలి అయిన తరువాత తీయాలి.

## వంకాయ పప్పు

కందిపప్పు బాగ మెత్తగ ఉడికిన తరువాత వంకాయ ముక్కలు తరిగి వేయాలి. ఆ ముక్కలు బాగ మెత్తగా ఉడికిన తరువాత చింతపండు పులుసు, ఉప్పు, కారం, కొద్దిగా ధనియాలు పొడి, జీలకర్ర వేయాలి. ఇది అన్నానికి చపాతిలకు బాగా ఉంటుంది.

## వంకాయ బజ్జి

వంకాయలు, పచ్చిమిరపకాయలు కొద్దిగా తీసుకొని, రెండు కలిపి నీళ్ళువేసి బాగ ఉడకనివ్వాలి. అది బాగ ఉడికిన తరువాత నీళ్లు వంచి వంకాయలు (పురుగులేనివి చూచివేయాలి) మిరపకాయలు కొద్దిగా ఉప్పువేసి మూరాలి. మూరిన దానికి పెరుగు వేసి కలపాలి. ఇదే వంకాయ బజ్జి అంటారు.

## వంకాయ చిప్స

వంకాయలు నాలుగు భాగాలు నిలువుగా చేయాలి. చేసిన దానిని చిప్సవలె మరి అడ్డంగా కత్తిపీటలో కోయాలి కోసిన ముక్కలను నూనెలో వేయించాలి. వేయించిన ముక్కలు గరిగరిగా ఉండాలి. దీనికి ఉప్పుకారం వేయాలి. చిన్న పిల్లలకు ఉప్పు ఒకటే రాసి ఇస్తే చాల ఇష్ట పడుతారు.

## వంకాయ గొజ్జు

వంకాయలు ముక్కలుగా తరగాలి. తరిగిన ముక్కలను కొద్దిగా నూనెవేసి మగ్గనియ్యాలి. సగం మగ్గిన ముక్కలను తగినంత చింతపండు పులుసు వేసి బాగ ఉడకనివ్వాలి. ఈ ముక్కలు పులుసులో ఉడికిన తరువాత, ఉప్పు, కారం, కొబ్బరి, పచ్చి ధనియాలు పొడిచేసి అందులో వేయాలి.

## వంకాయ చెట్ని

వంకాయలు పురుగులేనివి చూసి ఉంచుకోవాలి. వంట అయిన తరువాత కాలే బూడిదలో ఇవి వేయాలి. ఒక గంట తరువాత తీసిన వంకాయ మెత్తగా కాలి ఉండును. దీనికి తగినంత పాత చింతకాయ ఊరగాయ వేసి నూరాలి. ఇది చాలా రుచిగా ఉంటుంది.

—ఆర్. వసంత.

# వనితావాణి

## ఉద్యోగాలు : స్త్రీల ఇబ్బందులు

17—7—64 వనితావాణి ఉత్తరాల శీర్షికలో ఈ మధ్య వెలువడుచున్న ప్రముఖ రచయిత్రుల వ్యాస పరంపరపై అక్షయపాత్ర రాజేశ్వరి చేసిన విమర్శ అసందర్భం. ప్రఖ్యాత రచయిత్రుల కలాల నుండి వెలువడిన అమూల్యమైన అభిప్రాయాలు విజ్ఞానయుతంగా మహిళలలో చైతన్యాన్ని రేకెత్తించేలా ఉన్నాయి. ఏమైనా విమర్శ చేసే ముందు తగిన కారణాలతో సహేతుకంగా చేస్తే ఎంతైనా బాగుంటుంది.

కుమారి అంబటి దేవకి (ఖర్గపూర్)

* * *

17—7—64 మీ ( మా ) ఆంధ్ర సచిత్ర వార పత్రికలో వనితాలోకంలోని "ఉద్యోగాలు — స్త్రీల ఇబ్బందులు" వ్యాసంలో "ఇలాంటి సాకులు నా దగ్గర పనికిరావు. నిన్ను పెళ్ళి చేసుకునేటప్పుడు మీవాళ్ళు నీచేత ఎల్లకాలం ఉద్యోగం చేయించడానికి ఒప్పుకున్నారా, లేదా ?" అని రచయిత్రిగారు వ్రాయటంలో ఏమీ బాగాలేదు. ఈ మాట ఏ భర్త తన భార్యతో అనడు. కాని మందుప్పు లలితగారు ఎలా వ్రాసారో అర్థంగావడం లేదు. మొత్తానికి స్త్రీల ఉద్యోగాల గురించి చాలా బాగా విపులీకరించారు. ఇలాంటి చిన్న చిన్న మాటలతోనే వ్యాసాన్నంతా చెడకొడుతున్నారంటే తప్పు లేదేమో !

కె. సుగుణ (కాజీపేట) ★

తడి తారు రోడ్డుమీద, అంతకంటే వల్లటి మోటారు కారు, చెదురుమదురుగా ఉన్న చిన్నచిన్న గోతులను లెక్కచెయ్యకుండా, పందెంవేసినట్లుగా పరిగెడుతోంది. డ్రైవ్ చేస్తున్న శ్రీధర్ అవయవాలు యంత్రంలా పనిచేస్తున్నాయి. అతని ఫాలభాగాన్ని ఆవరించిన ముత్యాల్లాంటి స్వేదబిందువులు శ్రమకు చిహ్నంగా మిలమిల మెరుస్తున్నాయి.

కారుతో పోటీగా, శారద క్షేమాన్ని గురించిన ఆలోచనలు, మనోపథంలో పరిభ్రమిస్తున్నాయి. సమాధానంలేని ప్రశ్నలు, సంకట పరిస్థితిలో పడేస్తున్న సంశయాలు, శ్రీధర్ సహనాన్ని పరీక్షిస్తున్నాయి. తనింక ఆలస్యాన్ని భరించలేడు. గంట కరవై మైళ్ల వేగానికి అలవాటుపడ్డ శ్రీధర్‌కి. ఏభై మైళ్ల వేగం సంతృప్తి కల్గించడంలేదు, ఎంత తొందరగా శారద సాన్నిధ్యాన్ని చేరుకుని, ఆమె ఆరోగ్యాన్ని గూర్చి చల్లటి వార్త వింటానా అనే ఆరాటం అంతకంతకూ అధికమౌతోంది.

టైం చూసుకున్నాడు. ఏడు నలభై అయింది. తను గమ్యం చేరుకోవాలంటే ఇంకా పందమ్మైళ్లు దాటాలి. పదిగంటల లోపలే వూరు చేరుకోవచ్చు. అంటే రెండుగంటల పదిహేను నిమిషాలు గడవాలి.... నూట ముప్పయి ఐదు నిమిషాలు......... గుణించలేని సెకనులు......'అబ్బ!' అనుకున్నాడు శ్రీధర్. క్లబ్బులోనూ, శారద ఎదుట టైం అంటే ఎరుగని శ్రీధర్ ఇప్పుడు లెక్కలు కూడా కడుతున్నాడు. ఇందులో ఆశ్చర్యపడవలసిందేం లేదు. శారదంటే అతనికుండే అభిమానం అటువంటిది.

ఆ అభిమానంతోనే, శారద పుట్టింటికి వెళ్లేముందు, ఆమె నాపుచెయ్యాలని విశ్వప్రయత్నం చేశాడు. ''నువ్విక్కడే ఉండు! నర్సింగ్ హోమ్‌లో చేర్పిస్తాను. హాయిగా ఉంటుంది. మీ వూరు వెడితే ఇబ్బంది పడతావు.''— అని ఎంతో నెమ్మదిగా చెప్పాడు. తనమాట వింటేగా. ఆడవాళ్లంత తొందరగా మాట లక్ష్యపెడితే ఇంకేం!

'కాదండీ! తొలి కాన్పు పుట్టింట్లోనే జరగాలని మా వాళ్లు మరీ మరీ పట్టుబడుతున్నారు. అది ఆనవాయితీకూడా. ఈ ఒక్కసారి మా వాళ్ల కోరిక తీర్చండి.'— అని ప్రాధేయపడింది. ఆమె ప్రార్థనలకు తను కరగలేదు. అప్పట్లో వూరుకుంది తన మాటకింకా విలువనిస్తోందని సంతోషించాడుకూడా. కాని ఆ సంతోషం ఎంతోకాలం నిలువలేదు. శారద ఇంటికి ఉత్తరం వ్రాసిందో ఏమో— వెంటనే మామగారు కంగారుగా కూనూరునుంచి పరిగెత్తుకొచ్చి నానా హంగామా చేశారు.— 'తొలి చూలు పుట్టింట్లోనే జరగాలి నాయనా నీకు కొత్తగా ఇల్లాలైందిగాని నాకు ఎప్పట్నించో కుమార్తె అనే సంగతి మర్చిపోకు. కన్నకూతురుకి లోటు రానిస్తానా ఏదో ముసలివాళ్లం. మా చాదస్తాలను హేళన చెయ్యకు'— అని గడ్డం పట్టుకుని, మరీ చిన్నపిల్లవాడిలా బతిమాలుతుంటే మనసులో ఇష్టం లేకపోయినా ఎదురు చెప్పలేకపోయాడు. తన అసమర్థతకు ఫలితంగా శారద పుట్టింటికి వెళ్లిపోయింది.

ఎంత పల్లెటూరైనా కూనూరు మాత్రం వూరుకాదా! అక్కడమాత్రం పిల్లల్నిగన్న తల్లులు లేరా! అని తన మనసులోనే ధైర్యాన్ని చెప్పుకున్నాడు. కాని ఇప్పుడు, కూనూరు ఎందుకూ కొరగాని పల్లెటూరే అన్పిస్తోంది.

తను ఏది జరుగుతుందని శంకించాడో అది నిజమై కూర్చుంది. ఈ రోజే క్లబ్బులో స్నూకర్సు ఆడుతుంటే పోస్టుమాన్ తంతి తీసుకొచ్చాడు. కొంచెం ఆందోళనతోనే కవరు చింపాడు.

'స్టార్ట్ ఇమ్మీడియట్లీ డాటర్ సీరియస్' అని మామగారి పేరు కనిపించగానే కళ్లు తిరిగినట్లనిపించింది. మళ్లీ చదవబోతే అక్షరాలు అలుక్కుపోయాయి. విరిగిన మనసుతో, ఎవరికీ క్షమాపణ చెప్పకుండానే, కారులో ఏకాఏకిన, ఇంటికేనా వెళ్లకుండా, బయలుదేరాడు.

ఇప్పుడెవర్నని ఏం లాభంలేదు. అసలు వైద్య సదుపాయం సరిగా లేని వూరికి శారదను పంపించడం తనదే బుద్ధి తక్కువ. అపాయాన్ని శంకించినా ఆత్మధైర్యాన్ని కూడగట్టుకుని శారదకు అనుమతినిచ్చాడు. ఇప్పుడా స్థైర్యమంతా ఎక్కడిదక్కడ పటాపంచలైంది.

'తను ప్రమాదాన్ని కొనితెచ్చుకుని నా మనసుకు శాంతిలేకుండా చేసింది'.— శ్రీధర్‌కి శారదమీద అప్రయత్నంగా కోపమొచ్చింది. కాని జాలిగా కళ్ల ముందు మెదిలిన శారద రూపం కోపాన్నంతా రూపుమాపింది. జరగవలసిందేదో జరిగింది. దానికామెకూడా పూర్తిగా బాధ్యురాలు కాదు. ఇప్పుడేం బాధపడుతోందో ఏమో పాపం.— శ్రీధర్ ఆలోచనలు పరిపరివిధాల పరుగెడుతున్నాయి.

* * *

నిర్మలంగా ఉన్న ఆకాశం ఉన్నట్లుండి మేఘావృతమైంది. అంతవరకూ మిడిసిపడ్డ రేరాజు ముఖం చాటు చేసుకున్నాడు. తారకలు, 'నీతోపాటే మేమూ నన్నట్లుగా అతని వెనుకపడి మరుగున పడ్డాయి' టప టపమంటూ చినుకులు ప్రారంభమయ్యాయి. అవికూడా పెద్దవై ఏకధారగా వర్షం మొదలైంది. రానురాను వర్షపు హోరు, జోరుకూడా ఎక్కువయ్యాయి.

ఇదే రకంగా ఒకటి రెండు గంటలు వాన కురిస్తే కూనూరు పోయే రోడ్డుమీద కారు నడవడం కష్టం. అంతా బురదమయంగా ఉంటుంది. వెధవ రోడ్డు, వెధవ వూరూను. ఈ పల్లెటూళ్లు బాగుపడేదెప్పుడో! రోడ్డంతా గతుకులే. వూరి విషయం చెప్పనేక్కరలేదు. —ఒక్క నిముషంకూడా తోచదు. ఇంట్లో వాసాలు లెక్కపెట్టుకుంటూ, గోళ్లు గిల్లుకుంటూ జపం చెయ్యవలసిందే. వైద్యసదుపాయం ఆసలే లేదు. అటువంటి వూరికి పంతంపట్టి శారద ఎందుకు పోవాలి.— చేతులారా అపాయాన్ని కొని తెచ్చుకోవడం కాకపోతే. తనమాట లక్ష్యపెట్టద్దూ! ఆ ముసలిమామగారొకడు. ఉన్న ఒక్కగానొక్క సుకుమారి పట్నంలో ఏం కష్టపడుతుందోనని నానా కంగారుపడి ఆ పల్లెటూర్లో పడేశాడు. ఇప్పుడు సుఖపడి పోతోందిగా అక్కడ. మొదట్లోనే తను పట్టుపడితే ఇప్పుడింత వరకూ వచ్చేదికాదు. కనికరం చూపించాడు. ఇప్పుడు బాధపడడం తన వంతుగా మిగిలిపోయింది—. శ్రీధర్ అసహనం హద్దులు మీరుతోంది.

విసుగు విరామం లేకుండా కురుస్తోంది వాన. అందువల్ల దారి అంతా మసగ్గానే ఉంది. తోవసరిగా కనిపించడం లేదు. కారు వేగంగా నడవడం ప్రమాదకరమే. అయినా శ్రీధర్‌లో పట్టుదల వేళ్లు పాతుకుంది. వేగాన్ని తగ్గించలేదు. వర్షపు జోరు శ్రుతిమించుతోంది. క్షణక్షణానికి విజృంభిస్తున్న వాన శ్రీధర్‌లో అసహనాన్ని అధికం చేస్తోంది. ఎక్స్‌పర్ట్ డ్రైవర్ అని కొనియాడబడే శ్రీధర్ అనుభవం నేర్పిన పాఠాన్ని మర్చిపోయాడు. వాననీరువల్ల మరుగునపడ్డ గోతుల్లోంచి చక్రాలు పోయినప్పుడు కలిగే కుదుపులు అతని పట్టుదలను సడలించలేక పోయాయి.

అకస్మాత్తుగా 'క్రీక్' మని పెద్ద శబ్దంచేస్తూ కారు దేనికో గుద్దుకుంది. అమిత వేగంతో పోతున్న కారు ఆగడంతో శ్రీధర్ ముందుకు తూలిపడ్డాడు. ఉలిక్కిపడి సడన్ బ్రేకువేశాడు.

'ఎంత ప్రమాదం తప్పింది'!— మనసులోనే అనుకున్నాడు. స్టీరింగ్‌వీల్ గట్టిగా పట్టుకోవడం వల్ల తన ప్రాణాలు నిలిచాయి. లేకపోతే తనుముందుకు ఒరిగి పడడం, స్టీరింగ్ తన చెస్ట్‌కి బలంగా గుద్దుకోవడం ఒక్కసారి జరిగుండేవి. అప్పుడిక తనే లోకంలో ఉండేవాడో!

ఒక్క క్షణం అతని మెదడు పనిచెయ్యలేదు. అనుకోని ఈ ప్రమాదం అతని సహనానికి పరీక్షగా నిలిచింది.

టైం పదిన్నర దాటింది. పైన ఇంకా వాన హోరున కురుస్తూనే ఉంది. అయినా లక్ష్యపెట్టక, టార్పాలిన్ క్లాత్ కప్పుకుని, తన అదృష్టాన్ని పరీక్షించుకోవడానికన్నట్లు డోర్ తెరిచి కారుముందు భాగం వైపు వెళ్లాడు. కారు బాగా పాడైయుంటుందని తెలుసు. అయినా ఏదో ఆశ. బయొనెట్ తెరచి, తలలోపలికి దూర్చి, అగ్గిపుల్లలు వెలిగిస్తూ ఇంజను పూర్తిగా పరీక్షించాడు. కారు కదిలే పరిస్థితిలో లేదు. అంతవరకు మిణుకుమంటూన్న ఆశాజ్యోతి ఆరిపోయింది. బయొనెట్ విసురుగా మూసి, ఏం చెయ్యాలో పాలుపోక, కణతలమీద చెయ్యి ఆన్చి కళ్లు మూసుకు కూర్చున్నాడు— కారులో.

కూనూరు ఇంకొక పదిమైళ్లకంటే ఎక్కువ దూరం ఉండదు. నడిచిపోతే సుమారు మూడు గంటలు పడుతుంది. అసలీ వానలో నడవడం సాధ్యమా! రోడ్డంతా గతుకులే. ఏ గోతిలోనే పడితే లేవనెత్తే నాథుడెవడూ లేడు. శ్రీధర్‌కేం చెయ్యాలో తోచడంలేదు.

శారద నిస్సహాయంగా కళ్లల్లో మెదులుతూనే ఉంది. 'ఇంక లాభంలేదు. తనిక్కడ జాగరం చెయ్యాలేడు.'— అనిపించింది. అతనిలో మొండి పట్టుదల తన్నింది. వాన తగ్గుముఖం పట్టకపోయినా డోరు తెరచి, కారు లాక్‌చేసి నడవడం ప్రారంభించాడు.

చుట్టూ చిక్కని చీకటి. దోవ కనిపించటంలేదు. ఏదో నడుస్తున్నాడు. దారిలో చిన్నచిన్న గోతుల్లో కాళ్లు పడుతూనే ఉన్నాయి. తూలిపడి మళ్లీ లేస్తూనే ఉన్నాడు. టార్పాలిన్‌క్లాత్ కప్పుకున్నా తడుస్తున్నాడు. అప్పుడప్పుడతను అవివేకంగా ప్రవర్తిస్తున్నాడేమోనని ఎదురు ప్రశ్న వేసుకున్నా తన్నుతాను సమాధాన పరచుకుంటున్నాడు.

ఒక అరగంట గడచింది. నడుస్తున్న శ్రీధర్, కొద్ది దూరంలో మిణుకు మిణుకుమంటూ దీపాలు కనిపించడంతో షాక్ తిన్నవాడిలా ఆగిపోయాడు. కూనూరు

అప్పుడే వచ్చేసిరిదో తను అంచనా వేసుకున్నా ట్రైం ప్రకారం అప్పుడే చేరవలసిన వాడుకాదే. తను త్రోవ తప్పొడన్న మాట. అయితేం ఇదేం వూరు? కూనూరు ఇక్కడికెంత దూరం ఉంటుంది.?— రకరకాల ప్రశ్నలు శ్రీధర్‌లో మొలకలెత్తాయి.

ఏమైనా తను ముందుకు అడుగు వెయ్యక తప్పదు. మళ్లీ కారు దగ్గరికిపోయి ఇప్పుడు చెయ్య గలిగిందేమీ లేదు. వెనక్కిపోతే తనకి కారు కన్పిస్తుందనే నమ్మకంకూడా లేదు. ముందుకుపోతే ఏదేనా సహాయం లభిస్తుందనే ఆశేనా ఉంది. తన అదృష్టం బాగుండే ఇలా దోవతప్పి వచ్చాడేమో! ఈ పల్లెటూళ్లో ఏదో ఒక బండి దొరక్కపోదు— తను కూనూరు చేరినట్టే ఆనందిస్తున్నాడు శ్రీధర్.

పైన కుండపోతగా వాన కురుస్తూనే ఉంది. కాళ్లమీద బురదలో అడుగుతీసి అడుగు వెయ్యటం అతి కష్టంగా ఉంది. దానికితోడు పాంటు బాగా తడిసి బరువెక్కింది. పిల్లికి చెలగాటం ఎలిక్కి ప్రాణ సంకటంలా ఉంది తన పరిస్థితి. వాన తన పాలిట శనిలా దాపురించింది— మనసులోనే తిట్టుకున్నాడు శ్రీధర్.

దీపాలు వెలుగుతున్న ఇల్లు చేరువైంది. లోపల మనుషుల జాడమాత్రం లేదు. బహుశా నిద్దర పోతూ ఉండచ్చు.

గేటు తలుపు తీసి లోపలికి అడుగు పెట్టబోయిన శ్రీధర్, భౌ! భౌ!! మంటూ కుక్క అరవడంతో ఉలిక్కిపడి ఆగిపోయాడు. వరండాలో ఎవరో మనిషి కదిలిన చప్పుడైంది.

"ఎవరది?" చీకటిని చీల్చుకుంటూ ఎదురు ప్రశ్న శ్రీధర్‌ని నిలదీసింది. వెంటనే ఏం మాట్లాడాలో తోచలేదు.

"ఎవరంటే పలకరేం?"— ఈసారి కంఠంలో కరుకుదనం ప్రతిధ్వనించింది. ఆ ఆకారం లేచి నిలబడిందికూడా.

'ఇక్కడే కారు ప్రమాదంలో చిక్కుకున్నాను. ఏమైనా బండి దొరుకుతుందేమోనని ఇలా వచ్చాను.' శ్రీధర్ నాన్నాడు.

"అమ్మా! కారు పెమాదమే! ఈ వానకూడా జోరుగా కురస్తా ఉందే! లోనికి రండి బాబూ, ఈతలికే బాగా ముద్దై పోయుంటారు"—అంటూ అతడు లైటు వెలిగించాడు. ఆతని ఆహ్వానం నడీ సముద్రంలో దిక్కు తెలియని నావలా ఉన్న తనకు లంగరులా తోచింది. లోపలికడుగు పెట్టాడు.

"తమరే వూరి కెళ్ళాలని బాబూ!" కుతూహలంగా అడిగాడు ముసలివాడు.

"కూనురు."

"ఈడకి ఐదు కోసులుంటాది బాబూ! ఇది పగిడండి. ఈ వానలో పెయాణం కష్టమె కానీండి.. ఏదో చెప్పబోయాడు.

ఇంతలో తలుపు తెరచిన చప్పుడైంది. ఇంటాయన కాబోలు — తలుపు దగ్గరే ఉండి నౌకరు వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. అతడంతా విపులంగా చెప్పాడు. ఇంటాయన ముఖంలో సానుభూతి కద లాడింది.

"పావం! పెద్ద కష్టమే కల్గింది. తడిసిపోయారు కూడా, లోపలికి రండి. బట్టలు మార్చుకుందురు గాని." అంటూ, శ్రీధర్ ఏదో చెప్పబోతే అవకాశమియ్యకుండా, నౌకరు వైపు తిరిగి,

"కనకయ్యా! బండి సిద్ధం చెయ్యి!" అని ఇంట్లోకి అడుగుపెట్టారు.

అప్పటికే తన బట్టల ధర్మమా అంటూ వరండా కొంత తడిసింది. లోపల గదులుకూడా తడుస్తాయని భయపడ్డ శ్రీధర్ పైనే ఉండిపోయాడు. ఆయన బలవంతంమీద పంచ, లాల్చీ ధరించక తప్పలేదు.

"బండొచ్చేలోగా లోపల కూర్చుందురుగాని! రండి!" అని ఆయన ఆహ్వానించడంతో ఈసారి ఫరవాలేదని ధైర్యంగా ముందడుగు వేశాడు.

లోపలి కడుగుపెట్టిన శ్రీధర్ అల్లాగే అప్రతిభుడై నిలబడిపోయాడు.

—ఎదురుగా గోడకి తగిలించబడ్డ ఫోటో చూసి.

'వసంత'— అతని మనసు బాధతో మూల్గింది. ఆమె ఈ ఇంట్లోనే ఉంటోందా? ఇప్పుడు తనను చూస్తే చీదరించుకోదూ? ఆమె ఎదుటపడే హక్కు ధైర్యం లేవే తనకు!

"అలా నిలబడిపోయారేం? కూర్చోండి"— వింతగా శ్రీధర్ వైపు చూస్తూ, అన్నాడాయన. శ్రీధర్ యాంత్రికంగా కూర్చున్నాడు. ఇంకేదేదో అడగబోయిన ఇంటాయన శ్రీధర్ వాలకం చూసి విరమించుకున్నాడు. ఇద్దరి మధ్య నిశ్శబ్దం పెన వేసుకుంది.

ముళ్లమీద కూర్చున్నట్లున్న శ్రీధర్, "బండి సిద్ధమైంది బాబూ!" అన్న కనకయ్య పిలుపుతో జైలునుంచి విడుదలయ్యే నిర్భాగ్యుడిలా అనుభూతి పొందాడు. ఇంటాయనకు కృతజ్ఞత తెలియజేసి ఎల్లాగో బండిలో పడ్డాడు.

వానలో తడుస్తున్న ఎడ్లు ఒళ్ళు వేడెక్కడం కోసం అన్నట్లుగా పరిగెడుతున్నాయి. ఆకాశం మబ్బులతో ఇంకా దట్టంగానే ఉంది. వాన కొద్దిగా తగ్గుముఖం పట్టినా ఇప్పట్లో పూర్తిగా తగ్గే సూచనలే లేవు. వెచ్చదనంకోసం (కామోసు) వెలిగించిన చుట్టతో ఏదో అవ్యక్తానుభూతి పొందుతూ హుషారుగా ఎడ్లను అదలిస్తున్నాడు కనకయ్య. చుట్ట వెలుతురు కటిక చీకటిలో గర్వంగా మెరుస్తోంది.

శ్రీధర్ ఆలోచనల్లో శారద స్థానాన్ని, తాత్కాలికంగా, వసంత ఆక్రమించింది. వసంతను గురించి తెలుసుకోవాలనే ఆత్రత అతనిలో పరవళ్లు త్రొక్కుతోంది.

"కనకయ్యా!" కొంచెం ముందు జరిగి పిలిచాడు శ్రీధర్

"బాబూ!"

"మీ అయ్యగారికేమైనా పిల్లలా?"

"ఉన్నారు బాబూ"

శ్రీధర్ ఆశించిన సమాధానం రాలేదు.

"పెద్ద వాళ్లవరూ లేరా?"— మళ్లీ ప్రశ్నించాడు.

"ఒకమ్మాయి ఉండేది బాబూ!......కాని......"— కనకయ్య కంఠం రుద్ధమైంది.

"వూ!......— కాని......" శ్రీధర్ ఆత్రతగా మాట నందించాడు.

"ఆ అమ్మని ఈ పాపిష్టి మనుషులు బతకనీయ లేదు బాబూ!"

శ్రీధర్ నిశ్చేష్టుడయ్యాడు. కల్లోకూడా విన కూడని వార్త ఇది.



కనకయ్యే మళ్లీ ప్రారంభించాడు—

"అత్తారింట్లో నరకమనుభవించందా తల్లి! నదువుకొనే రోజుల్లో ఎవడితోటో సంబంధం ఉందని మొగుడు రాచిరంపాన పెట్టేవాడండి. వూరంతాకూడా అదేమాట కోడై కూస్తుంటే ఆ నింద భరించలేక యేర్లో పడింది బాబూ! అన్నెం పున్నెం తెలీని మాలచ్చిమి."

"......ఈ చేతుల్తో మా యమ్మను పెంచాను బాబూ! ...... ఈ పాపిష్టి చేతుల్తోనే ఏట్లోపడ్డ బిడ్డను బయటకు లాగాను......" కనకయ్యగొంతు పెగల్లేదు. పై మిాది కండువాతో కళ్లను ఒత్తుకున్నాడు. పెంచినప్రేమ అటువంటిది.

శ్రీధర్‌కి అంత వానలోనూ, ముచ్చెమటలు పోశాయి. వసంతకు, తను చేసిన అన్యాయం ఎటువంటి విపరీత పరిణామాలకు దారితీసింది!

—హృదయం ఘోషిస్తోంది. అతని మనసు కొన్ని సంవత్సరాలను వెనుకకు మళ్లి విద్యార్థి దశ ముందు ఆపింది.

తను కాలేజిలో చేరినప్పుడు, లెక్చరరు మొదటి రోజు అటెన్‌డెన్స్‌వేస్తూ— 'వసంత'— అని పిలిచినప్పుడే తన నాపేరు ఆకర్షించింది. ఇంత చక్కటి పేరుగల అమ్మాయి ఎలా ఉంటుందో చూడాలనే కుతూహలం మనసును దొలచ నారభించింది. ఆ అమ్మాయిని మొదటిసారిగా చూసినప్పుడు అజంతా శిల్పం తన కళ్లముందు సజీవంగా నిలవలేదు కదా! అన్న భ్రాంతిలో పడ్డాడు. అయస్కాంతంలా ఆకర్షించే ఆమె నయనాలు, పాలరాతిలా మెరిసే నున్నని నుదురు, కెంపులద్దినట్లుండే చెంపల ఆకర్షణ, సంపెంగలాంటి ఇంపైన నాసిక, అందమైన చిన్న నోరు— ఇవి చాలవూ ఎవరైనా కవ్వించడానికి అందుకనే ఎందరో ఆమెకు దాసోహమన్నారు. ఆమె కొనకంటిచూపుకోసం కలవరించారు. అందర్నీ త్రోసిరాజని తనకు సన్నిహితురాలయింది. తమ స్నేహం ప్రేమగా మారి వివాహానికీ పునాదులు వేసింది. తనెంతగా పొంగిపోయాడప్పట్లో! కాని ఆ ఆనందం పాలపొంగులాంటిదే అయింది. ఇంట్లో తన ఆదర్శాన్నెవరూ హర్షించలేకపోయారు. పరాయి కులం సంబంధం సాంప్రదాయానికి విరుద్ధమన్నారు. 'ఈ పెళ్లి జరిగితే మిగతా పిల్లల పెళ్లిళ్లు కావని అమ్మ మొత్తుకుంది. తనలోని చేతకానితనం తలెత్తింది. తను తల వంచాడు. అమూల్యరత్నాన్ని చేజేతులా జారవిడుచుకున్నాడు. వసంతకు మళ్లీ మొహం చూపించలేక పోయాడు. ఉత్తర ప్రత్యుత్తరాలేం జరగలేదుకూడా!

కాలప్రవాహం శారదను తనకప్పగించింది. ఆమె ఆకర్షణలో వసంతను మర్చిపోగలుగుతున్నాడు. కాని తనకు మానసిక శాంతిలేకుండా ఏమిటో సంఘటనలు. పాత జ్ఞాపకాలను త్రవ్వడం కోసమేనా తను దారితప్పి వసంత ఇంటికి చేరాడు.

శ్రీధర్ తల వేడెక్కుతోంది. కళ్లు తెరిస్తే వసంత, కళ్లుమూసినా వసంతే మెదుల్తోంది.

"నువ్వు నా జీవితాన్ని నాశనంచేశావు. ఆశలు రేపి మోసం చేశావు. దగాపడ్డ నా జీవితం తర్వాత కూడా తప్పుదారులు పట్టింది. దానికికూడా నువ్వే కారణం. నా ఉసురు నీకు తగలక పోదు!"— అని [illegible] స్తోంది. శ్రీధర్ చెవులు గట్టిగా మూసుకున్నాడు.

"కనకయ్యా! కూనూరెంత దూరముంది?" —నిస్సహాయంగా ప్రశ్నించాడు.

"దగ్గరకొచ్చేశాం బాబూ! వంతెనొచ్చేసిందిలెండి. ఇద్దాటేమంటే ఇంకో కోసెడుంటుంది"

"అబ్బ! అంత దూరమే!" తను చేరలేని దూరమన్నట్లుగా అన్పిస్తోంది శ్రీధర్‌కి.

గతుకుల రోడ్డుమిాద బురదలో బండి ఎల్లాగో [illegible] కనకయ్య ఎడ్లను గట్టిగా అదలిస్తున్నాడు. కొన్ని గంటలు ఏకధారగా హోరున కురిసిన వాన చాలవరకు తగ్గుముఖం పట్టింది. బండి టాపుమిాద పడుతున్న చినుకులు టప టపమని చప్పుడు చేస్తున్నాయి.

కళ్లు మూసుకున్న శ్రీధర్ కళ్లలో వసంతే మెదుల్తోంది.

32 వ పేజీ చూడండి

# ప్రత్యేక వ్యాసావళి-4

# హాయిల్ నర్లేకర్ సమీకరణాలూ-ప్రత్యేకతా!

## శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.

> మేము వేస్తున్న హాయిల్ నర్లేకర్ సమీకరణాల ప్రత్యేక సమీక్షకు సంబంధించిన వ్యాసాలలో యిది ఆఖరిది. సం॥

**యు**వ నర్లేకర్ జనకులు, వి. వి. నర్లేకరుగారు చెప్పినట్లు ఏ నవీన సిద్ధాంతమైనా దానికి పూర్వమున్న సిద్ధాంతాల లోటును పూర్తిచెయ్యడానికని అవతరిస్తుంది. హాయిల్ నర్లేకర్ సమీకరణలు కూడా అయిన్‌స్టీను సిద్ధాంతములో ఉన్న లోటును భర్తీ చెయ్యడానికే వచ్చాయి. అయిన్‌స్టీను లెక్కలలో ఒకచోట ధన చిహ్నము (ప్లస్సు) వాడడానికి కూడా వీలైనచోట, ఆయన ఋణ చిహ్నము (మైనస్) వాడినారు. అలాగ మైనస్ వాడినప్పుడే గురుత్వాకర్షణ అని అనిపించిన ఫలము వస్తుంది. ఆ లెక్కలను బట్టి ప్లస్సే వాడి ఉంటే గురుత్వ-ఆకర్షణ కాక, గురుత్వ-వికర్షణ జరగాలన్న తీర్మానము వస్తుంది.

అంటే "ఆపిలు పండు చెట్టును వీడి న్యూటను నెత్తిమీద పడకుండా ఆకాశము వైపు ఎగిరిపోయి ఉండాలి" అని హాయిల్ రాయల్ సొసైటీవారిముందు తానిచ్చిన ఉపన్యాసములో చమత్కరించాడు. రెండు చిహ్నాలు వీలే అయినప్పుడు ఒక చిహ్నాన్నే స్వీకరించవలసి రావడం అయిన్‌స్టీను లెక్కలలో కొంత ధార్ష్టికమును ప్రవేశపెట్టిందని హాయిల్ విమర్శ. ఇప్పుడు ఆయన నిర్మించిన సమీకరణాలలో అలాటి అవసరం లేకుండానే 'గురుత్వాకర్షణ' వివరించబడింది.

అయిన్‌స్టీను వాదములో రెండో లోటు "వస్తువుమీద మనకు కానవస్తున్న ఆకర్షణ వస్తువు లేకపోయినా ఉంటుందనడమ"ట. భూమికి చేరువగా ఒక ఉల్క పోతూన్నదని వూహించండి. అది భూమికి చేరువగాపోతూన్నప్పుడు దాని మొదటి ఋజు (Straight) మార్గములో పోకుండా, కొంతవరకు భూమివైపు మొగ్గి ప్రయాణిస్తుంది. ఇదీ మనకు కనబడుతున్న దృశ్యము. ఇప్పుడు, దీనికి కారణము ఏమిటీ అని ప్రశ్న వేద్దాం. న్యూటను "భూమి, ఆ ఉల్కను తనవైపు ఆకర్షిస్తోంది. కనుక, తనదారిని తానుపోలేక, ఆ ఉల్క భూమివైపు మొగ్గిందంటాడు. అయిన్‌స్టీను "భూమిచుట్టూ ఉన్నఅంతరాళము [కాలాంతరాళము= (Time Space) కావడమువల్ల] అదనపు వక్రత దానికి దాపురిస్తుందీ, ఉల్క ఆ వక్రమార్గంలో పడడములో భూమికి చేరువగా వస్తుంది. మార్గముయొక్క వక్రతను ఆకర్షణ అని అనడము ఎందుకూ?" అంటాడు. ఇక్కడ హాయిల్ విమర్శ ఏమిటంటే : "అయిన్‌స్టీను వాదము ప్రకారము కాలాంతరాళపు దారులు వక్రముగా ఉంటాయి. ఉల్కలాంటి వస్తువు భూమి చేరువగా పడినా పడకపోయినా ఆ దారుల వక్రత ఉండనే ఉన్నది. వస్తువు గమనంలో గోచరించే ఆకర్షణలాంటి ఫలితాన్ని వివరించబోయిన అయిస్టీను, దారుల వక్రతయే కారణమని చెప్తూ "వస్తువు లేకపోయినా ఆకర్షణ ఉంటూనే ఉంది" అని తేల్చినాడు. మన అవస్థ అంతా వస్తువులమీది ప్రభావాన్ని వివరించటమే కాగా, "వస్తువు లేకపోయినా ఆ ఫలితము ఉంటూనే ఉంది, అనడము ఎలాటిదీ?" అని. ఇప్పుడు హాయిల్ నర్లేకర్లు చేసిన సమీకరణాలనుబట్టి 'వస్తువు లేనప్పుడు ఆకర్షణవంటిదే లేదు' అన్న తీర్మానము వస్తుంది. 'యుక్తమే కదా?' అంటారు హాయిల్ నర్లేకర్లు.

ఏ క్రొత్త వాదమైనా చేయవలసిన పనులు మూడు. ఒకటి : ఇప్పటికి తెలిసిన విజ్ఞానవస్తువును సమర్థించడము. రెండు: ఇప్పుడు వచ్చిన చిక్కును విప్పడము. మూడు : తెలియని కొత్త ఫలితాన్ని సూచించడము. హాయిల్ నర్లేకర్ల కొత్త గురుత్వాకర్షణ వాదముఆకర్షణను సమర్థిస్తూన్నది. వారి సమీకరణాలను అయిన్‌స్టీను సార్వత్రిక సాపేక్షవాద సూత్రములపై నారోపించినప్పుడు, ఇదివరలో హాయిల్ ఉన్నదని వూహించిన సృష్టి క్షేత్రము (C-Field) ఉన్నట్లుగా సిద్ధిస్తూన్నది. క్వాసారులనే బ్రహ్మాండ నక్షత్రాలు లావా మాదిరిగా నక్షత్రముల వస్తువును చిమ్ముతూండడానికి కారణము లభిస్తూన్నది. ఆ క్వాసారులు కుంచించుకుంటూ ఉండడములో వాటి గర్భములోని (C-Field) కుంచించుకోలేక అక్కడి నక్షత్రవస్తువును ఎగదన్నుతుంది. ఆ వస్తువు మహాశక్తితో బయటికి చిమ్మి, రేడియో తరంగాల్ని— అపరిమిత శక్తిమంతాల్ని— ప్రసారిస్తుంది. ఇవన్నీ ఆక్వాసారుల ఫోటోగ్రాఫులలో కానవస్తాయి. క్వాసారులవంటి బ్రహ్మాండ నక్షత్రాలు ఇప్పటికి తెలిసిన ప్రక్రియలవల్ల వేటివల్లా ఏర్పడగలవన్న నమ్మకములేదు. 'హాయిల్—ఫౌలర్లు' వూహించి, చెప్పేరు అలాంటి ఏర్పడగలవని. ఆ వాదపు పొడిగింపే ఈనాటి హాయిల్ నర్లేకర్ వాదము.

ఈ రీతిగా తెలిసిన విజ్ఞాన వస్తువును సమర్థించడమూ, చిక్కులను విప్పడమూ చేసింది హాయిల్ నర్లేకర్ గురుత్వాకర్షణ వాదము. గురుత్వాకర్షణమన్నది ఏకదేశ ఘటన కాదనీ, సృష్టిలో నున్నట్టి వస్తురాశి యంతటి ప్రభావమూననీ వారి వాదము. ఇది సంభవమా? అన్న సందేహానికి వారు చెప్పే సంజాయిషీ ఇది గురుత్వాకర్షణ ప్రమాణానికీ విద్యుదాకర్షణ ప్రమాణానికీ ఉన్న నిష్పత్తియే (Ratio) ఎలక్ట్రాను వ్యాసార్ధానికి (Radius) కీ పరిచిత విశ్వముయొక్క వ్యాసార్ధానికీఉన్నది. ఇది యధాలాభ సంబంధమా? విశ్వములోని వస్తువంతా ప్రొటానులుగనే ఉండియున్నట్లైతే అవి పైన చెప్పిన నిష్పత్తికి వర్గము (Square) తోసమానము. ఇది యధా లాభమేనా? విశ్వములోని ప్రతి వస్తువుకీ, విశ్వమంతటితో సంబంధము ఉన్నట్లుగా వీటి సూచన; హాయిల్ నర్లేకర్ల వాదముకూడాను.

అయితే దాఖలా చూడగల క్రొత్త సంగతులేవైనా ఈ వాదము చెప్పినదా? అన్న పరీక్ష మిగిలి ఉన్నది. హాయిల్ నర్లేకర్లు అయిన్‌స్టీను ఏకైక క్షేత్ర వాదమునకు ఒప్పుకోకుండానే ఆ వాదము సాధించనెంచిన కార్యమును— గురుత్వాకర్షణ, విద్యుదాకర్షణ, న్యూక్లియశక్తి—, క్షేత్రముల నన్నిటినీ సమీకరించు పనిని— సాధించ నాశించుచున్నారు ఒకటే; హాయిల్ చెప్పిన సృష్టి క్షేత్రమును ప్రయోగరీత్యా గుర్తించుటకు వీలు కలిగించడానికని ఆలోచిస్తున్నారు. రెండూ ఇవి ఫలవంతమైతే హాయిల్ వాదము విజయవంతమైనట్లే.

"అయితే అయిన్‌స్టీను వాదము తప్పేనా?" అని అడుగుతారేమో పాఠకులు. రెండు వస్తువులు ఒకదానిని ఇంకొకటి ఆకర్షించడానికి నైసర్గిక గురుత్వమే కారణమనీ, ఆ ఆకర్షణ కేవలము ఆ వస్తువుల దూరమును బట్టియే మారుననీ న్యూటన్ అన్నాడు. దానికి గురుత్వమూ ఆకర్షణా కాదు కారణమూ, కాలాంతరాళ వక్రత కారణమని, అయిన్‌స్టీను అన్నాడు. హాయిల్ విశ్వములో, ఉన్న వస్తు సర్వస్వమే కారణమంటూన్నాడు. ఇది అభిప్రాయ దశనుదాటి సిద్ధాంత దశకు రావడము మన అనుభవాలను బట్టి ఉంటుంది. గురుత్వాకర్షణ అన్నదే బహుబలహీనము. అనుభవములో ఈ భేద సిద్ధాంతసారంగా రావలసిన భేధాలు పట్టుపడడము చాలకష్టము. నేడు ఉన్న ఖగోళాలలో సగము లేకుండినట్లైతే భూమి అణగారిపోతుందనీ, సూర్యుడు దుర్నిరీక్ష్యుడౌతాడనీ చెప్పే అంచనాలను సోదా చూడడ మెలాగు? సమాప్తం ★

మీరు డ్రిల్లు, లాంగ్‌క్లాత్ కొనేటప్పుడు...

# ట్విన్ టస్కర్

చిహ్నంకోసం చూడండి.

ఈ చిహ్నం మీరు విశ్వసించదగిన నాణ్యతకు ఇది గుర్తు!



# హార్వే ట్విన్ టస్కర్

డ్రిల్లు, లాంగ్‌క్లాత్

మధుర మిల్స్ ఉత్పత్తి - నాణ్యమైన నూలుకు మారుపేరు.

మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మదురై

మేనేజింగ్ ఏజెంట్లు: ఎ & యఫ్ హార్వే లిమిటెడ్.



## మధురకు చేరిన హార్వేన్

B3 MMC-13 A TG

**7-8-1964 శుక్రవారము మొదలు 13-8-1964 గురువారము వరకు**

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం మొత్తం మీద బాగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు ఇది వరకు చేసిన కృషికి ఫలితం ఈ వారం పొందగల సూచనలు ఉన్నాయి. అధికారుల వలన జరుగ వలసిన పనులు సులభంగా నెరవేరతాయి. వృత్తితో అన్ని వ్యవహారాలు మీరు అనుకొన్నట్టుగా జరగడం వలన ఆదాయం పెరగక పోయినా సంతృప్తికరంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం పెరుగుతుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో మీరు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో వ్యయప్రయాసల మీద స్వల్పాభివృద్ధిని సాధిస్తారు.

స్త్రీలకు — ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును గాని వాటి వల్ల యే కార్యక్రమమూ ఆగిపోదు.

9, 10 తేదీలు మంచివి. 11, 12 తేదీలు మంచివి కావు.

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.

ఈ వారం అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయి గాని భారీ యెత్తున చేసే వ్యాపారాల్లో సాహసం పనికిరాదు. రాబోయే సహాయాన్ని నమ్మి కొత్త వ్యవహారాలు ప్రారంభించడం వలన వ్యయ ప్రయాసలకు గురికాగల సూచనలు ఉన్నాయి. వృత్తికి సంబంధించిన కార్యక్రమాల్లో కొంచెం శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో పెద్ద మార్పులు రావు. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో కొన్ని తగాదాలు రావచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఆకస్మికంగా కొన్ని చిక్కులు రావడం వలన మానసిక శాంతి లభించక పోవచ్చును.

స్త్రీలకు — అనారోగ్య సూచనలు ఉన్నాయి. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి.

11, 12 తేదీలు మంచివి. 13వ తేదీ మంచిది కాదు.

## మిథునం :

(మృగశిర 3, 4 పా ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈ వారం గతవారం కంటే బాగా ఉన్నా సాహసించి యేపని చేయడానికీ వీలులేదు. వృత్తి వ్యాపారాల్లో గత కొద్ది వారాలుగ యేర్పడిన చికాకులు తగ్గు ముఖం పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు రావడం వలన ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్య సాధన చేస్తారు. కోర్టు వ్యవహారాల్లో కొంతమంది వ్యక్తులు మీకు తోడ్పడడానికి వారంతట వారే ముందుకు వస్తారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | | గు | కు శు రా |
| శ | వారఫలం | | ర చం |
| | మహేష్ | | బు |
| కే | | | |

స్త్రీలకు — ఆరోగ్యం సంతృప్తి కరంగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకగానే నెరవేరతాయి. అలంకార వస్తువులు కొంటారు.

13 వ తేదీ మంచిది. మిగిలినవి సామాన్యం.

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

వృత్తి వ్యాపారాల్లో మీరు ప్రారంభించిన పనులు నెరవేరినా ఎప్పుడూ యేదో ఒక విధంగా ఆందోళన కలిగించే పరిస్థితి యేర్పడ వచ్చును. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయాసకు తగిన ప్రయోజనం ఉండదు. వృత్తిలో కొన్ని నూతనావకాశాలు లభిస్తాయి కాని ఫలితం చేతికి వచ్చే వరకూ నమ్మడానికి వీలులేదు. ఉద్యోగంలో మీ పరిస్థితి ఇది వరకటి కంటే బాగా ఉంటుంది. ఉష్ణ సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. రాజకీయ వ్యవహారాల్లో కొన్ని మార్పులు రావడం వలన భవిష్యదభివృద్ధికి మార్గం యేర్పడుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

7, 8 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలించగల సూచనలు ఉన్నాయి గాని అత్యాశకు పోవడం మంచిది కాదు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా అనుకూలంగా ఉండ వచ్చును. భాగస్వాములతో కొన్ని భేదాభిప్రాయాలు రావడం వలన పొందవలసిన లాభాన్ని పొందలేని పరిస్థితి యేర్పడ వచ్చును. వృత్తి ఉద్యోగాల్లో హోదా, ఆదాయం కూడా పెరుగుతాయి. బంధువుల వ్యవహారాల్లో ఆడంబరం కోసం వ్యయం చేయవలసి వస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. సత్పురుషుల సహవాసం లభిస్తుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

9, 10 తేదీలు మంచివి. 7, 8 తేదీలు మంచివి కావు.

**సూచన**

మహత్తర వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం గడచినకొద్ది వారాలకంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో వెంటనే విశేషమైన ప్రయోజనం లేకపోయినా నిరుత్సాహ పడవలసి అవసరం ఉండదు. అధికారుల వలన జరుగవలసి పనులు నెరవేరి లాభం కలుగుతుంది. వృత్తి ఉద్యోగాల్లో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. మాట పట్టింపులకు దిగడంవలన మీ కార్యక్రమాలు నిలిచి పోవచ్చును కాబట్టి వాద ప్రతివాదాలకు పూనుకోవడం మంచిది కాదు. ఆరోగ్యం బాగా ఉన్నా కొంచెం బలహీనత ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసికొనడం వలన నిష్ఠూరం రావచ్చును.

7, 8 తేదీలు మంచివి. 9, 10 తేదీలు మంచివి కావు.

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ. 1, 2, 3 పా.)

ఈ వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉన్నా వారాంతానికి చికాకులు కలిగే సూచనలున్నాయి. వృత్తి వ్యాపారాల్లో ఆదాయం పెరగక పోయినా అన్ని పనులూ చురుకుగా సాగడం వలన సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తిలో ప్రయోజనం గల పరిచయాలు కలుగుతాయి. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశం లభించడం వలన సాటివారిలో గౌరవం పెరుగుతుంది. కోర్టు వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావడం వలన వ్యయ ప్రయాసలకు గురికాలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. పుణ్యకార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరం. శుభమూలంగా ధనవ్యయం జరుగుతుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

9, 10 తేదీలు మంచివి. 11, 12 తేదీలు మంచివికావు.

## వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం మీ వోర్పుకు పరీక్షా సమయం. ప్రతి వ్యవహారంలోను యెంతో జాగ్రత్తగా వ్యవహరించ వలసి ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో నష్టం

రాగల సూచనలు ఉన్నాయి గాని మీ సమయోచిత ప్రజ్ఞ వలన తప్పించుకొనే అవకాశం ఉంది. రావల సిన డబ్బును నమ్మి యే వ్యవహారమూ ప్రారంభిం చడం మంచిదికాదు. వృత్తి ఉద్యోగాల్లో మార్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలించవు గాని ఇప్పటి స్థితికి భంగం కలగదు. వృత్తి రీత్యా చేయవలసిన ప్రయాణాలు వాయిదా పడవచ్చును. స్వల్ప అనా రోగ్యం చేస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగు తుంది. ప్రయాణాలు చేస్తారు.

11, 12 తేదీలు మంచివి. 13వ తేదీ మంచిది కాదు.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో యెన్నో అవకాశాలు ఎండ మావులవలె కన్పిస్తాయి కాని అవి ఫలించడం కష్టం. వ్యాపారంలో మీరు ఇదివరకు ప్రయత్నం చేసిన వ్యవహారాలు ఒక మిత్రుని సహాయం ద్వారా నెరవేరవచ్చును. వృత్తిలో శ్రమమీద కొంత అభివృద్ధిని సాధిస్తారు. ఉద్యోగంలో పై అధికారు లతో భేదాభిప్రాయాలు రావచ్చును గాని తరు వాత మీ అభిప్రాయాలే సరియైనవని రుజువు కావడం వలన ఇతోధికమైన గౌరవాన్ని పొందు తారు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయకూడదు. ప్రేమ వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు శ్రమమీద నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

9, 10, 13 తేదీలు మంచివి. 7, 8 తేదీలు మంచివి కావు.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

ఈ వారం మొత్తం మీద బాగా ఉన్నా సాహస ముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచ నలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో అన్ని కార్య క్రమాలు మీరు అనుకొన్నట్లుగా జరగడం వలన ఆదాయం పెరుగుతుంది. మీ ఆలోచ నలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా తోడ్పడతాయి. వృత్తి ఉద్యోగాల్లో ఇంతవరకు మీ అభివృద్ధికి ఆటంకంగా ఉన్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందక కొంత ఇబ్బంది కలగవచ్చును గాని మీరు యేదో ఒక విధంగా పరిష్కరించగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు సంతృప్తి కరంగా నెరవేరతాయి. నూతన విషయాలు తెలుసు కొంటారు. బంధువుల్లో ఖ్యాతి లభిస్తుంది.

11, 12 తేదీలు మంచివి. 9, 10 తేదీలు మంచివి కావు.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వ్యాపారంలో మామూలుగా జరిగే పనులకు కూడా యెంతో శ్రమ పొందవలసి వస్తుంది. భాగస్వాము లతో యేర్పడిన అభిప్రాయ భేదాలు తొలగి పోతాయి. మీ అవసరాలకు తగినట్లుగా డబ్బు యేదో ఒక విధంగా సర్దుబాటు కావడం వలన ఒడు దుడుకులు లేకుండా ఈ వారం గడచి పోతుంది. వృత్తిలో శ్రమకు తగిన ప్రతిఫలం లభించదు. ఉద్యోగంలో అకారణంగా అధికారుల మందలింపు లకు గురికావలసి వస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతి పక్షాల్లో చీలిక రావడం వలన మీకు అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—వారాంతానికి అనారోగ్య సూచనలు ఉన్నాయి. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

9, 10, 13 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు యేర్పడిన ఆరోగ్య కలిగించే పరిస్థితులు చాల వరకు తొలగి పోతాయి గాని పూర్తి అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. కొన్ని తగాదాల్లో చిక్కుబడిపోయిన డబ్బు చేతికి రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తిలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగం సాధారణంగా ఉంటుంది. వృత్తి రీత్యా చేసిన ప్రయాణాలు ఫల వంతం కాగలవు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దూరపు బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువు లతో భేదాభిప్రాయాలు వస్తాయి. సంతోష కరమైన వార్తలు వింటారు.

7, 8 తేదీలు మంచివి. 9, 10, 11 తేదీలు మంచివి కావు.



# జన్మదినఫలం

జన్మదినఫలం

## ఆగస్టు-7

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని చెప్ప డానికి అవకాశం లేదు. సంవత్సర ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా సంవత్సరాంతానికి వూహించని చికాకులకు గురికావలసి వస్తుంది. మీరు ఇంత వరకు సంతృప్తికరంగా నిర్వహిస్తున్న వ్యవహారాల్లో కూడా చిక్కులు రావచ్చును. వృత్తిలో వ్యతిరేక వాతావరణం ఏర్పడగల సూచనలు ఉన్నాయి. ఉద్యో గంలో ఇతరులుచేసే పొరబాట్లకుకూడా మీరే బాధ్యత వహించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. పట్టుదలకు సమయంకాదు. అన్ని విషయాల్లోనూ తటస్థంగా ఉండటంమంచిది. ఆరోగ్యంకూడా బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ఆకస్మికంగా వచ్చే మార్పులవలన మీ ప్రతిపక్షాలపై పైచేయి కావచ్చును. విద్యార్థులు మొదటినుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

## ఆగస్టు-8

ఈ సంవత్సరం గత సంవత్సరంకంటే బాగా ఉన్నా సాహసించి ఏ పనిచేయడానికి వీలులేని సమ యం. వ్యాపారంలో ఏవో ఆటంకాలు వస్తూ ఉండడంవల్లన మీ వూహలు కార్యరూపం ధరిం చడం కష్టం అవుతుంది. వృత్తి ఉద్యోగాల్లో కూడా చికాకులు రావచ్చును కాని విశేష ప్రాబల్యంగల వ్యక్తుల సహాయం మీకు లభించడంవలన నష్టం ఏమీ కలుగకుండా తప్పించుకొనగలరు. కొన్ని వ్యవహారాలు కోర్టువరకు వెళ్లగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. సంతానానికి స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలువైన వస్తువులు కొంటారు. కొంతమంది బంధువులకు సమయానికి సహాయం చేయగలుగు తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## ఆగస్టు-9

ఈ సంవత్సరం సామాన్యంగానే ఉంటుంది కాని సంవత్సరాంతంలో కొంచెం అనుకూల పరిస్థితి ఏర్పడవచ్చు. వ్యాపారంలో ఆదాయం పెరిగినా వ్యయం కూడా పెరగడంవలన అంత సంతృప్తి కరంగా ఉండదు. అధికారులవలన జరుగవలసిన పనులు కొంత శ్రమమీద సాధ్యం కాగలవు. వృత్తిలో మార్పులకోసం ప్రయత్నం చేయడానికి సమయం కాదు. ఉద్యోగంలో మీ స్థానాన్ని నిలబెట్టుకొం టారు. స్థిరాస్థి వ్యవహారాల్లో కొంత ప్రయాస పడిన తరువాత అనుకూలమైన మార్పులు రావ చ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యధాతాథంగా ఉంటాయి. మీరు ఇంతవరకు చేస్తున్న శుభకార్యాలోచనలు ఫలిం చడానికి అవకాశం ఉన్నది. రాజకీయాల్లోనూత నోద్యమాలను ప్రస్తుతానికి వాయిదా వేయడం మంచిది. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉండవచ్చును.

## జూలై-10

ఏ వ్యవహారాలు ఎలాగ ఉన్నా ఈ సంవత్సరం ఆర్థికంగా బాగా ఉంటుంది. ఏదో ఒకవిధంగా ఎప్పుడూ డబ్బు చేతిలో ఉంటుంది గాని సంవత్సరం మధ్యలో మీకు అంతగా ఇష్టంకాని వ్యవహారాల్లో పెట్టుబడి పెట్టవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

43 వ పేజీ చూడండి

# కొత్త మంత్రిణి ఇందిరా గాంధీ



నలభై
ఏడు సంవత్సరాల
ఇందిరా ప్రియదర్శిని
జవహర్ లాల్ నెహ్రూ
ఏకైక పుత్రిక!

"ఆమె ఎంతో అందంగా ఉంది. ఆమె నిర్మల స్వభావం నాకు చాలా సంతోషం కలిగించింది ... గాలికి కొట్టుకుపోతుందా అనిపించే చిన్న పువ్వులాగ కనిపించింది నాకు. కాని గాలి అంటే ఆమెకి భయం అనుకోను."

[క్రిస్టియాన్ టోలర్ 27-8-1936 లో నెహ్రూకి లండన్‌నుంచి వ్రాసిన ఉత్తరం నుంచి.]

ఇందిరాగాంధీకి రాజకీయానుభవాలు చాలా చిన్నప్పుడే ఏర్పడ్డాయి. మోతీలాల్ నెహ్రూ ఒకసారి 'ముద్దాయి'గా బోనులో నుంచున్నంత సేపూ నాలుగేళ్ల యీ మనవరాలిని ఎత్తుకునే ఉన్నాడుట!

## పువ్వు పుట్టగానే....

ఇందిరా ప్రియదర్శిని చిన్న పాపగా ఉన్నప్పుడు తన బొమ్మలకి రాజకీయోపన్యాసాలు ఇచ్చేదని చదువుతాము. 12వ ఏటనే కాంగ్రెసుకి అనుబంధంగా ఉండే ఒక పిల్లల సంఘం ఏర్పరచింది.

విద్యనభ్యసించే కాలంలో కూడా ఆమె రాజకీయాలకి దూరంగా ఉండలేక పోయింది. కూతురిని మామూలు కాలేజిలలో చేర్పించటానికి ఇష్టపడని జవహర్ లాల్ నెహ్రూ ఆమెని శాంతినికేతన్‌లో చదివించి, పై చదువులకి స్విట్‌జర్‌లాండ్‌కు, ఇంగ్లండ్‌కు పంపాడు. ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకుంటున్నంతకాలం ఇందిరా ప్రియదర్శిని విద్యార్థుల ఉద్యమాలలో పాల్గొంటూనే ఉంది.

## దేశానికి తిరిగి రాక

1938లో, భారతదేశానికి తిరిగి వచ్చినతర్వాత, కాంగ్రెసు సభ్యురాలయింది. నెహ్రూ కుటుంబంలో వారికి రాజకీయాల కొరత ఉండదు. క్రమంగా ఇందిరాగాంధీ (ఫిరోజ్ గాంధీ అనే పార్శీని 1942లో పెళ్ళి చేసుకుంది; ఫిరోజ్ గాంధీ మరణించినప్పుడు అతని దేహాన్ని హైందవ సంప్రదాయం ప్రకారం దహనం చేశారు) 1959 - 60లలో అఖిల భారత కాంగ్రెసుకి అధ్యక్షురాలయింది. జవహార్‌లాల్ నెహ్రూతో వివిధ దేశాలు పర్యటించటమే కాక భారతదేశ ప్రతినిధిగా తనే ఎన్నో ప్రదేశాలు పర్యటించింది. అయితే ఇదంతా తండ్రి పలుకుబడి వల్ల సాధించినదే అనేవారు లేక పోలేదు. వారి 'ఆరోపణ'లో నిజం కొంత ఉండనూ వచ్చు. కాని, కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని రద్దు చేయించటం నుంచి, యు. పి. లో ముఖ్యమంత్రుల్ని మార్చటం దాకా ఈమె కారకురాలని చెప్పుకునే వదంతుల్ని బట్టి ఇందిరాగాంధీకి వ్యక్తిత్వం అసలే లేదనే వాదం అంత నమ్మదగిందిగా కనిపించదు. అసలు, తండ్రి కీర్తి, గొప్పదనం ఆమెకి అవరోధాలుగానే ఉండేవి- ఇంకా ఉంటున్నాయి!- అనే అనుమానం కూడా కలుగుతుంది. ఇక వామపక్షవాదులుగా చలామణి అవుతూ జవహార్‌లాల్ నెహ్రూ చుట్టూ చేరిన



శ్రీ బి. కె. నెహ్రూ, ఇందిరాగాంధీ శ్రీ

అవకాశవాదులు కొందరు ఈమెకి సహజంగా ఉన్న సామర్థ్యాన్ని మరింత కప్పిపుచ్చటానికి తోడ్పడ్డారేమో!

## ఇప్పుడామె సామర్థ్యం

ప్రస్తుతం సమాచార శాఖ మంత్రి(ణి)గా పని చేస్తూ, కామన్వెల్త్ సమావేశంలో శ్రీ కృష్ణమాచారి తోడుతో భారత దేశపు ప్రతినిధిగా వెళ్ళిన శ్రీమతి ఇందిరాగాంధీ 'అసలు రాజకీయ జీవితం' ఇకపైనే ప్రారంభం అవవచ్చు. 'ముందు మోతీలాల్, తర్వాత గాంధీ నీడలో బ్రతికిన జవహర్‌లాల్ నెహ్రూ గొప్పతనం వారిద్దరూ మరణించిన తర్వాతనే పూర్తిగా బయటపడింది,' అన్నారొక రచయిత. కొంత దాకా ఇందిరాగాంధీ విషయంలో కూడా అటువంటి ఊహ నిజమవుతుందేమో.... చూడాలి.



ండన్ జాన్సన్ (అమెరికా అధ్యక్షుడు)

జూలై రెండో తేదీన కేంద్రమంత్రిగా శ్రీమతి ఇందిరా గాంధీ ప్రమాణస్వీకారం చేసినప్పుడు ఆమె నందరూ అభినందించారు. అందుకు అందరూ సంతోషించారు. కాని ఆమెను దేశమంత ప్రేమగా, దేశాన్ని తన కూతుర్ని చూసినంత ప్రేమగా, పెంచిన జవహర్‌లాల్ మాత్రం యీ ఒక్క వేడుకను చూడలేదు! ఆయన తరఫున దేశమంతా శ్రీమతి ఇందిరను హర్షించింది. ఈ సందర్భంలో శ్రీమతి ఇందిరాగాంధీ అంతర్జాతీయ ప్రాచుర్యాన్ని చూపగల ఒక ప్రత్యేక గోష్ఠి [నెహ్రూగారు బ్రతికుండగా అమెరికాలో జరిగింది] ని కూడా వేస్తున్నాము. నూతన సమాచార శాఖ మంత్రిణిగా ఇందిరాగాంధీకి మా శుభాకాంక్షలు. సం॥

ప్ర: చూడండి ! ఆ మధ్య శ్రీ నెహ్రూ అస్వస్థులయినపుడు, మీరు అదనపు పనిని, ఆదనంగా అధికారాలను తీసికొన్నారని వింటున్నాం. ప్రస్తుతం మీ తండ్రికి మీరు ఎలా తోడ్పడుతున్నదీ చెప్తారా?

జ : మీరు విన్న వార్తలు నిజమైనవి కావు. అంతకు పూర్వం ఏం చేస్తూ ఉండేదాన్నో, ప్రస్తుతమూ అదే చేస్తున్నా. కొంత కాలాన్ని పార్టీ పనికీ, మరికొంత సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు వినియోగిస్తున్నా. అంతే !

ప్ర : అంటే, దేశవిధానాలకు సంబంధించిన వ్యవహారాలలో మీ నాన్నగారికి తోడ్పడటం లేదన్నమాట.

జ : అలాంటిదేమీ లేదు— ఎటొచ్చీ, ఆ ప్రసక్తి పార్టీ కార్యవర్గం చర్చకు వస్తే తప్ప.

ప్ర : మీ నాన్నగారు తమ తరువాత మిమ్మల్ని ప్రధాని పదవికి నిర్ణయించినట్లు, న్యూయార్క్ 'హెరాల్డ్ ట్రిబ్యూన్' పత్రిక ప్రకటించింది. ...... వాస్తవం ఏమిటి ?— సహజంగా, మీ నాన్నగారికి మీకంటే సన్నిహితులు మరొకరు ఉండరు కదా !

జ : ప్రధాని పదవికి కొత్త వాళ్లను నిర్ణయించే విషయం పార్టీకి సంబంధించినదనీ, ఆ పని తాము చేయబోవటం లేదని శ్రీ నెహ్రూ మొదటి నుంచీ చెప్తూనే ఉన్నారు. అందువల్ల కొత్త ప్రధానిని ఎన్నుకోవలసింది కాంగ్రెసు పక్షం.

ప్ర : అదినరే.... పోనీ, ప్రధానిగా ఉండాలని మీకైనా అభిప్రాయం ఉందా ?

జ : లేదు.

ప్ర : మీరు ఇక్కడికి వస్తూ, ఇక్కడి అధ్యక్షునికి మీ నాన్నగారి వద్ద నుంచి ప్రత్యేకమైన కబురు తెచ్చారని పత్రికలలో వార్తలు వెలువడుతున్నాయి ! ఈ విషయమై మాకు మీరేం చెపుతారు ? మీరు తెచ్చిన కబురుకు ఏమైనా ప్రత్యేకమైన ప్రాముఖ్యత ఉన్నదా ? లేక, అది కేవలం ఒక అభినందన మాత్రమేనా ?

జ : అది కేవలం అభినందన సందేశం మాత్రమే.

ప్ర : ఒక విషయం అడుగుదామనుకొంటున్నాం.. మీ నాన్నగారొక పెద్ద మర్రిచెట్టులాంటి వారనీ, ఆ చెట్టు నీడన మరేమీ పెరగవని ఒకప్పుడు చెప్పుకొనేవారు. పరిస్థితి ఇంకా అలాగే ఉన్నదా ? లేక, ఆయన తన అనుయాయుణ్ణి తయారు చేస్తున్నారా ?

జ : నా అభిప్రాయం ప్రకారం, సుమారు నాలుగైదు సంవత్సరాల నుంచి, మరొకర్నెవరినైనా తయారు చేయాలని మా నాన్నగారు కృషి చేస్తున్నట్లున్నారు !.... మర్రిచెట్టూ, నీడా అన్నారు కదా ! దేశీయ జీవనంలో కొన్నిమార్లు కొన్ని వస్తువులు పెరగటానికి నీడ అవసరం.

ప్ర : ప్రస్తుతం మటుకు వెలితురు వస్తున్నదని చెప్పవచ్చునా ?

జ : అదే మాటల్లో చెప్పదలిస్తే.... అది నిజమే ?

ప్ర : సెక్యులర్ రాజ్యంగాను, పార్లమెంటరీ ప్రజాస్వామిక దేశంగాను ఇండియాను రూపొందించటానికి మీ నాన్నగారు 17 సంవత్సరాల పాటు కృషి చేశారు. మీ నాన్నగారి పథకాలను, ఆశలను చెదరగొట్టేందుకు మత తత్వ శక్తులు ఏం చేశాయి ? శ్రీ నెహ్రూ తయారు చేసిన పథకాలను తుదముట్టించాలని ఆశక్తులు ప్రయత్నాలు చేయటం లేదూ !

జ : అవన్నీ ప్రత్యేక మయిన సందర్భాలు. లోగా జరిగిన మత తత్వపు పోరాటాలకు మేమెంతో విచారించాం. అయినా, ఆ అల్లర్లు ఇండియాలోని మత సామరస్యాన్ని ఛిన్నాభిన్నం చేయలేదు.

ప్ర : రాజకీయాలకు సంబంధించిన మరో ప్రశ్న— ప్రధాన మంత్రి పదవి అక్కర్లేదని మీరన్నారు. పోనీ, పార్టీ మిమ్మల్నే ఎన్నుకొంటే? తిరస్కరిస్తారా ? అంగీకరిస్తారా ?

జ : మొదటి విషయం— నేను ఇండియా పార్లమెంటు సభ్యురాల్ని కాను. పార్లమెంటు సభ్యత్వం లేకుండా ప్రభుత్వంలో ఉండే అవకాశం లేదు.

ప్ర : కాకపోయినప్పటికీ, మీ దేశపు ప్రజ మీరే ప్రధాని కావాలని కోరుకొన్నప్పుడు ?

జ : నేనే ప్రధాని కావాలని, ప్రజలు అంతటి చైతన్యం, కోరిక ఉంటాయన్న ఆశ నమ్మలేకుండా ఉన్నాను.

ప్ర : అంటే, మీరు, ఆ రోజు వస్తే, ప్రధాని పదవిని తిరస్కరించరన్నమాట !

జ : తొంభయిపాళ్ళు తిరస్కరిస్తాను.

ప్ర : తొంభయి పాళ్లే. చాలా పెద్ద అంకే... ఆ సమస్యను అలా ఉంచుదాం... పోతే, ఇండియా తటస్థ విధానాన్నే అనుసరిస్తున్నది. అలానే కాశ్మీరును కూడా అలీనంగా ఉంచుతూ, ఇండియా

# శ్రీమతి ఇందిరాగాంధితో అమెరికాలో జరిగిన ఒక ప్రత్యేక గోష్ఠి



—పాకిస్తాన్ ఉభయదేశాలకూ అతీతంగా ఉంచితే—దీర్ఘకాలికమైనా ఈ సమస్య సమసిపోతుందిగా?

జ : చైనా, రష్యాలు ప్రాంచి ఉన్న అలాంటి చిన్న దేశాన్ని ఏకాకిగా వదలటం వాంఛనీయం కాదనే అనిపిస్తుంది.

ప్ర : పోనీ, ఈ తటస్థ విధానాన్ని కాశ్మీరుకు కూడా వర్తింప చేయాలని ఇండియాలో ఎవరైనా శ్రద్ధతో ఆలోచించారా ?

జ : ఎవరూ ఆలోచించారని అనుకోను.

ప్ర : కొన్ని మిత్రదేశాలు, ఈ 'సమస్యను' పైకి తీసుక వచ్చినట్లు మీకు తెలుసు. కాశ్మీరుకు తటస్థ విధానాన్ని ఇవ్వకూడదని మీ నాయకులు గట్టిగా భావిస్తున్నారా !

జ : నామటుకు, నాకు, ఏ విషయంలోనూ మూఢ నమ్మకాలులేవు. కాని, ఒక సంగతి చెప్తాను. కాశ్మీరు సమస్యను, కాశ్మీరు ఇండియాలకు గల సంబంధాలను, విశాల దృక్పథంతో చూడవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ప్ర : కమ్యూనిస్టు చైనా, పాకిస్తాన్‌ల మధ్య సంధి పొసగుతున్న విషయం మీకు తెలిసే ఉండాలి. ఇండియా యొక్క జాతీయభద్రత మీద అది ఎలాంటి ప్రభావాన్ని ప్రసరిస్తుంది ?

జ : ఆ ఉభయదేశాల మైత్రి, ఉన్న సమస్యలను మరీ క్లిష్టతరంగా చేయవచ్చును— అంటే మా సరిహద్దులు ప్రమాదకరమైన స్థితిలో పడే అవకాశమున్నదన్న మాటే.

ప్ర : చైనా, పాకిస్తాన్‌ల కలయిక వలన చైనా ఇండియా మీద దాడి చేయుటానికి అవకాశాలు ఎక్కువవుతున్నాయని చెప్పగలుగుతున్నారా ?

జ : అవుననే చెప్పాలి. కారణం ఏమంటే అలాంటి క్లిష్ట పరిస్థితి ఏర్పడిన రోజున పాకిస్తాన్ వైఖరి ఎలా ఉంటుందో తెలియదు కనుక.

ప్ర : అమెరికా పాకిస్తాన్‌కే మద్దతును ఇస్తున్నట్లు మీరొకసారి అన్నారట. మీరంగా నిందకు ఆధారాలేమిటి ?

జ : క్షమించండి. ఇది నింద మాత్రం కానే కాదు. అమెరికా ఇండియాకు చేసిన ఆర్థిక, సైనిక సహాయాలకు కృతజ్ఞత చెపుతూ, కాశ్మీరు విషయంలో అమెరికా పాక్షిక వైఖరిని అనుసరిస్తున్న దన్న ఆలోచన భారతీయులను విచారగ్రస్తులను చేసిందని అన్నాను. అంతే.... ఇండియాలో ఉన్న అభిప్రాయం కూడా అదే.

ప్ర : ఉభయ దేశాలతోనూ మైత్రిని పెంపొందించటానికి అమెరికా ప్రయత్నాలు చేసి, ఒక రకంగా క్లిష్ట పరిస్థితి నడుమనే చిక్కుకున్నది. కానీ, "న్యూయార్కు టైమ్స్" పత్రిక ప్రకారం మీరన్న మాటలు ఇవి : "పాశ్చాత్య దేశాలు పాకిస్తాన్‌పైనే మొగ్గును చూపుతున్నాయను కొంటున్నాం. అయినా ఫర్వాలేదు." అన్నారు మీరు. దీనికి బుజువేదైనా ఉందా ?

జ : కొంత ఆధారం లేకపోలేదు. అమెరికా ప్రతినిధి ఐక్యరాజ్యసమితిలో చేసిన ఉపన్యాసమూ, అమెరికా నుంచి వచ్చిన కొందరు చెప్పిన మాటలు విన్న తరువాత అసలు వాస్తవాలను అమెరికా విస్మరించ దలిచినట్లు బోధపడుతున్నది.

ప్ర : తమ రాష్ట్రపు భవిష్యత్తును నిర్ణయించుకొనే అధికారం కాశ్మీరు ప్రజలకు భారత ప్రభుత్వం ఇవ్వక పోవటాన్ని ఎలా సమర్థిస్తారు?

జ : ఇంతవరకు మూడు సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. పైగా, పాకిస్తాన్‌లో గాని, పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీరులో గాని ఎన్నికల ప్రసక్తి, ప్రజా ప్రాతినిధ్యం మాట లేనేలేవు.

ప్ర : కాని, తమ రాష్ట్రం భారతదేశంతోనే ఉండాలా ? అక్కర్లేదా ? అన్న అంశంపై— అభిప్రాయం చెప్పే అవకాశం కాశ్మీరు ప్రజలకు రాలేదుగా ?

జ : ముఖాముఖీ ఆ అవకాశం రాకపోవచ్చును. కాశ్మీరులోని 'నేషల్ కాన్ఫరెన్సు' విధానాలు అక్కడి ప్రజలకు తెలుసు. ప్రతిపక్షం అయిన 'ప్లెబిసైట్ ఫ్రంట్' విధానాలూ తెలుసు. అందువల్ల వాళ్ళు తమ అభీష్టాన్ని వ్యక్తం చేసికొనలేనిదెక్కడ!

ప్ర : స్వయం నిర్ణయాధికారం ఉండాలంటూ ఇండియా 'సమితి'లోనూ, ఇతరత్రానూ ఎన్నో సార్లు చెప్పింది ? అదే సూత్రాన్ని కాశ్మీరుకు కూడా వర్తింప చేయుటానికి ఎందుకు తిరస్కరిస్తున్నారు ?

జ : ఇప్పుడే చెప్పానుగదా ! వోటు చేసే అధికారం కాశ్మీరు ప్రజలకు లభించింది. పైగా, కాశ్మీరు మరొక దేశంకాదు.

ప్ర : మీ దృష్టిలో కాశ్మీరు భారతదేశంలో ఒక భాగం. మరి కాశ్మీరు అలా అనుకోదుగదా ? పైగా, అలా అనుకోని ప్రజలు కూడా కాశ్మీరులో లేక పోలేదు. అందువల్ల సమితి తీర్మానం ఒకటి కోరినట్లూ, ఇండియా ఒకప్పుడు అంగీకరించిన జనవాక్య సేకరణ సులభమైన పరిష్కార మార్గం కదా ?

జ : 'సమితి' తీర్మానాల ప్రసక్తి వచ్చింది కనుక చెప్తున్నాను. అవి చాలా ఉన్నాయి. పాకిస్తానీ సేనలను తొలగించమన్నది మొదటి తీర్మానం. కాని ఆ తీర్మానం అమలు జరపలేదు. యుద్ధ విరమణ తీర్మానాన్ని కూడా ఉల్లంఘించటం జరిగింది. పైగా ఇండియామీద ఆ నేరాన్ని మోపారు. అందువల్ల ముందు జరగవలసిన తీర్మానాలు సరిగా అమలు జరిగితే, మిగతా వాటి విషయం ఆలోచించవచ్చు.

ప్ర : అంటే పాకిస్తాన్ తన సేనలను ఉపసంహరించుకొంటే, 'జనవాక్య సేకరణ'కు అవకాశం ఉంటుందనేనా మీ అభిప్రాయం ?

జ : ఆ నాటి పరిస్థితి మారిపోయిందని మీకు తెలుసు. చైనా రంగంలోకి రావటమే అందుకు కారణం ఈ జరుగుతున్న 'పాచికలాట'ను మేము ఎలా విస్మరించగలం ?

ప్ర : చైనా మీ మీద దాడి జరిపిందన్న వాస్తవం దృష్ట్యానూ, మీ సేనలు అక్కడి సరిహద్దుల్లో ఉండటం వల్లనూ— ఆ దేశంతో ఒక ఒప్పందానికి రావటం ముఖ్యమని మీకు తోచ లేదా ?

జ : మొదటి సంగతి— ఆ సరిహద్దుల్లో మా సేనలు లేనే లేవు. వాటిని ఉపసంహరించుకోవటం ఎన్నడో జరిగి పోయింది. కాని, పాకిస్తాన్‌తో మైత్రి భావంతో మెలగాలన్న మాట నేనూ అంగీకరిస్తాను. చైనా శత్రుత్వం దృష్ట్యానే కాకుండా, పాకిస్తాన్, ఇండియాల సంయుక్త ఆర్థిక, సాంఘిక అవసరాల దృష్ట్యా కూడా ఉభయదేశాలు మైత్రిభావంతో ఉండాలని నా భావన. అదే జరిగితే ఉభయ దేశాలకూ పరస్పరం ఎంతో లాభదాయకమూ, శ్రేయస్సూ.

ప్ర : కాశ్మీరు మాజీ ప్రధాని షేక్ అబ్దుల్లాను పదేళ్ల తరువాత విడుదల చేశారు. అంటే, కాశ్మీరు సమస్యలో కొంత రాజీకి అవకాశం ఉందని అర్థమా ?

జ : కాశ్మీరు విషయమై చర్చలు జరుపుకోవాలని మేము ఎప్పుడూ అనుకొంటూ ఉండే మాట వాస్తవమే— కాని, షేక్ అబ్దుల్లా విడుదలకూ, సమస్యకూ ఎలాంటి సంబంధం లేదు.

ప్ర : కాశ్మీరు ప్రజలకు స్వాతంత్ర్యాన్ని బోధిస్తున్నాడని అరెస్టు చేశారు. కేసు కొంత నడిపారు— అకస్మాత్తుగా ఆయనను విడుదల చేయుటంలో గల ఆంతర్యం ఏమిటి ?

జ : ఇది కేంద్రానికి సంబంధించినది కాదు. కాశ్మీరు ప్రభుత్వానికి మాత్రమే సంబంధించి ఉన్నది.

ప్ర : కాశ్మీరు సమస్య పరిష్కార మార్గంగా ఆయన స్వాతంత్ర్యం కావాలని కోరటంలేదా ?

జ : లేదు. తాను స్వాతంత్ర్యం సంగతి మాట్లాడటం లేదని ఆయన స్పష్టంగా చెప్పారు.

ప్ర : అయితే, అబ్దుల్లా ఇటీవల కాశ్మీరులో చేసిన ప్రసంగాలు పార్లమెంటులో అంతటి అలజడిని కలిగించటానికి కారణమేమిటి ?

జ : అబ్దుల్లా అన్ని రకాల వ్యాఖ్యానాలు చేశారు. వాటిల్లో కొన్ని, పార్లమెంటు సభ్యులకు అమోదకరం కాకపోవచ్చును. అయినా, ఈ సంగతి వ్యాఖ్యానించటం చాలా కష్టం.

ప్ర : అబ్దుల్లా తిరిగి అరెస్టు కాగల అవకాశాలున్నాయని ఒక వదంతి. మీకేమైనా తెలుసా ?

జ : ఆయన అరెస్టు అవుతారని నేననుకోను.

ప్ర : మరొక విషయం. అదనపు ఆయుధ సహాయం కావాలని మీ రక్షణ మంత్రి వై. బి. చవన్ అమెరికాను కోరనున్నట్లున్నారు ? అందుకు అమెరికా అంగీకరిస్తే — భారత దేశానికి అత్యధిక ఆయుధాలను సరఫరా చేసేది అమెరికా అనీ, రష్యా కాదనీ ఇండియా రూఢి చేస్తుందా ?

జ : ఆ సంగతి శ్రీ చవన్‌నే అడగండి. రెండు దేశాలతో మైత్రి నెలకొల్పుకోవాలని మా భావం. మా దేశపు భౌగోళిక అవసరాల దృష్ట్యా అది తప్పదు.

ప్ర : చైనా, రష్యాల స్పర్ధలు ఇండియా మీద ఎలాంటి ప్రభావాన్ని ప్రసరిస్తాయి ! రష్యా చైనాను ఏ విధంగానైనా ఆటంక పరుస్తున్నదని మీరు భావిస్తారా ? అందుకేమైనా ఆధారా లున్నాయా ?

జ : ఆ పనిని రష్యా చైనా మా దేశం మీద దురాక్రమణ జరిపినపుడు చేసింది.

ప్ర : అప్పటి సంగతి కాదు, నేనడగటం ప్రస్తుతపు పరిస్థితి...... ?

జ : ప్రస్తుతం వాళ్ల సంబంధాలు ఎలా ఉన్నాయో నాకు తెలియదు.

ప్ర : మళ్లీ కమ్యూనిస్టు చైనా ఇండియా మీద దాడిజరిపితే, రష్యా ఇండియాకు సైనికంగాను, ఆయుధాలున్నా, సహాయం చేసేటంతగా ముందుకు వస్తుందా ? ఒకప్పటి మిత్ర రాజ్యమైన చైనాకు వ్యతిరేకంగా రష్యా మసలుతుందా?

జ : ఆ సంగతిపై, నేనేమీ వ్యాఖ్యానించ లేను.

ప్ర : మరొకమారు చైనాతో సంఘర్షణ వస్తే, మీకు అమెరికా, బ్రిటన్‌ల ఆకాశ గొడుగును అందజేయవలసిన అవసరం ఉంటుందని అనుకోరూ ?

జ : బహుశా, అవసరం కావచ్చు.

ప్ర : అలా జరిగితే, మీరు అమలు జరిపే అలీన విధానానికి అంతరాయం కలిగినట్లు కాదా ?

జ : అలీన విధానానికి ఇతర దేశాలతో అంతరాయం కలిగినట్లు నాకు అర్థం అవుతున్నది. పాకిస్తాన్ చైనాతో చేతులు కలుపుతున్నది. పైగా ఫ్రాన్సు, గ్రేట్‌బ్రిటన్ లాంటి దేశాలు చైనాతో సంబంధాలను నెలకొల్పుకొంటున్నాయి.

ప్ర : అలా అనుకొంటే, కమ్యూనిస్టు చైనా జరపగలదనుకొనే దాడిని ఇండియా ఎదుర్కొనేందుకు వీలుగా బ్రిటన్, అమెరికాలు ఆకాశగొడుగును అందజేయటం మాత్రం ఆయా దేశాలు అలీన విధానానికి వ్యతిరేకంగా లేదా ?

జ : ఇది కేవలం ఒక బృందం లాంటిది మాత్రమే.

ప్ర : చైనా, కొన్ని ఆటంకాలను ఎదుర్కొంటూ కూడా తన దేశ ప్రజలకు కొంత శ్రేయస్సును కలిగించిందనీ, ఆర్థికాభ్యుదయం జరిగిందని ఇక్కడ అధికారరీత్యా వింటున్నాం ? మీ అభిప్రాయం ?

జ : చైనా దేశపు వ్యవహారాలు నాకు బాగా తెలియవు.

ప్ర : చైనా—రష్యాల స్పర్ధ ఇండియాలోని కమ్యూనిస్టులల్లో ఎలాంటి చైతన్యమయినా తీసుకురాగలిగిందా ? ఆ స్పర్ధ ఇండియాలోని కమ్యూనిస్టుల మీద ఎలాంటి ప్రభావాన్ని ప్రసరించింది ?

జ : ఇండియాలోని కమ్యూనిస్టు పార్టీలో కూడా చీలికలు వచ్చాయి.

ప్ర : ఆ సంగతి మాకూ తెలుసు. కాని ఆ చీలికలు ఇండియాలోని పార్లమెంటు మొదలైన ప్రధాన తావుల్లో ఎలా పరిణమిస్తున్నాయి ?

జ : 'కేరళ' అనే ఒక రాష్ట్రంలో తప్ప కమ్యూనిస్టులు ఇండియా రాజకీయాలలో మార్పును తీసుక రాలేక పోయారు. అందువల్ల వాళ్ల స్పర్ధలకూ, ఇండియా పరిస్థితులకు అవినాభావ సంబంధమేమీ ఉండదు.

ప్ర : వాళ్లల్లో వాళ్లు తగవులాడుకుంటూ, ముఠాలుగా తయారయినందువల్ల పార్టీ బలం క్రమేణా తగ్గుతుందని చెప్పగలరా ?

జ : తగ్గిపోవచ్చు— కాని, దాన్ని ప్రస్తుతం విపులీకరించటం తొందరపడ్డట్టే అవుతుంది.

ప్ర : ఇండియాలో మళ్లీ కరువు సంభవించనున్నదని వింటున్నాం ? అందులో వాస్తవం ఎంత ?

జ : అటువంటిదేమీ నేను వినలేదు.

ప్ర : ఇటీవల ఏదైనా కాటకం ఏర్పడిందా !

జ : ఆ మధ్య కొద్దిగా, ఆహారధాన్యాల కొరత మాత్రం వచ్చింది. కరువుకాటకాల ప్రసక్తి లేదు.

ప్ర : పూర్తిగా ఆహారకొరత మాత్రం లేదంటారు ! అవునా ?

జ : అవును. ఆహారకొరత పూర్తిగా లేదు.

ప్ర : మీ దేశంలో మత, సంప్రదాయ విధానాలను అనుసరించి 'పశువధ'ను నిషేధించారట. ఆహార కొరతకు బహుశా, అదీ ఒక కారణం కావచ్చునేమో !

జ : హిందువులకు, విశ్వాసవ్యక్తుల్ని, ఇది హృదయాలను స్పందించే అంశం. నాకు తెలిసినంత వరకు, సంప్రదాయాన్ని గాని, చట్టాన్ని గాని ఈ విషయంలో— మార్చే ప్రయత్నం జరగలేదు. కాని పరిస్థితులను మెరుగుపరచటానికి కృషి ఎప్పుడూ జరుగుతూనే ఉన్నది.

ప్ర : 1961లో మీ దేశంలో జరిగిన జనాభా లెఖల సేకరణ, ప్రకారం జనాభా విపరీతంగా పెరిగిపోతున్నట్లు తేలింది. తత్ఫలితంగా కుటుంబ నియంత్రణ ప్రచారానికి నిధులను పదిరెట్లు అదనం చేశారు ? పరిస్థితి ఏమయినా మెరుగయిందా ?

జ : ఎంతో అభివృద్ధి జరిగింది. ప్రజలు కూడా కుటుంబ నియంత్రణ పట్ల ఆసక్తి చూపుతున్నారు.

ప్ర : అయితే, ఈ నాడు మునుపటి కంటె కొంత 'జననాల' సంఖ్య, తగ్గుముఖం పట్టిందా ?

జ : అందుకు సహజంగా కొంత కాలం పడుతుంది.

ప్ర : జనాభా పెరుగుదల సమస్యను మీదేశంలో పూర్తిగా ఏ నాడు అరికట్ట గలుగుతారు ? మీ అంచనాలు ఏమిటి ?

జ : ఒక అంచనా అంటూ ఏమీ లేదు. ఏ నాడు సాధ్యమయితే, ఆనాడే ?

ప్ర : మరొక విషయం. ఇండియా— రష్యాల

56వ పేజీ చూడండి



ఇందిరాగాంధీ, లేడీ బర్డ్ [శ్రీ లిండన్ జాన్సన్ సతి]

## ఎదురుచూచినవసంతం

23 వ పేజీ తరువాయి

"నువ్వు సుఖపడలేవు. అమాయకురాలైన ఒక అబల ఉసురు నిన్ను వెంటాడుతూనే ఉంటుంది"— అని రౌద్రాకారంతో ఆమె తనను శపిస్తున్నట్లని పిస్తోంది.

శ్రీధర్‌కి ఒడలు కంపించసాగింది. మనసు శారద గురించి కీడునే శంకిస్తోంది. శారద లేకపోతే తను బ్రతకలేడు. వసంతే ఈ విధంగా తనమీద ప్రతీకారం తీర్చుకుంటోందా?

—శ్రీధర్ రెండు చేతులతోనూ తలను గట్టిగా పట్టుకున్నాడు.

—అది పగిలిపోతుందనే భయంచేత గామోసు.

వూరు దగ్గరవుతున్నకొద్దీ అతనిలో ఆతృత అధికం కాజొచ్చింది. బండి దిగి పరుగెడుదామా అనిపిస్తోంది అతనికి.

"బండిని కొంచెం జోరుగా పోనీయ్ కనకయ్యా!"

—బతిమాలే ధోరణిలో అన్నాడు.

"అలాగేనండి! అయినా వచ్చేశాం బాబూ! ఇంకో ఐదు నిమిట్లలోనే వూరు చేరమా!"— కనకయ్య భరోసా శ్రీధర్‌కి కాస్త సంతృప్తినిచ్చింది.

బండి మామగారిల్లు చేరడంతోటే ఏమాత్రం ఆలస్యంచేయకుండా శ్రీధర్ బండి దిగి, తలుపు తట్టాడు. తలుపు తెరచిన మామగారు శ్రీధర్ అంత వానలో రావడం చూసి ఆశ్చర్యపోయారు.

"శారద కులాసాగా ఉందండీ!" ఆతృతగా ఆయన ముఖంలోకి చూస్తూ ప్రశ్నించాడు శ్రీధర్.

"ఆ! తల్లి పిల్ల కులాసాయే నాయనా. భగవంతుడు మనల్ని చల్లగా చూశాడు."— అన్న మామగారి మాటలు అమృత వాక్కుల్లా చెవిని సోకాయి. శ్రీధర్‌లో ఆనందం వెల్లి విరిసింది.

"కనకయ్యా!"— ఉత్సాహంగా కేకేసాడు.

"బాబూ!"— అంటూ ఒక్క క్షణంలో కళ్ళ ముందు నిలిచాడు కనకయ్య.

వెంటనే జేబులోంచి పదిరూపాయల కాయితం తీసి కనకయ్య చేతుల్లో ఉంచబోయాడు.

"వద్దు బాబూ! నేను మీకు చేసిందేపాటి, ఈ డబ్బు తీసికోడానికి"— కనకయ్య తీసుకోలేదు.

"నీకు తెలియదు కనకయ్యా! నీ సహాయమే లేకపోతే నేనీ వూరు చేరుకోవడం ఇప్పట్లో జరిగేది కాదు. ఈ డబ్బొక లెక్కకాదు. దీన్ని తిరస్కరిస్తే నా మనస్సుకి సంతృప్తి ఉండదని" శ్రీధర్ బలవంత పెట్టడంవల్ల కనకయ్య డబ్బు తీసుకోవక తప్పిందికాదు.

ఇదంతా గుడ్లప్పగించి చూస్తున్న మామగారికి అయోమయంగా ఉంది. కనకయ్య సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

"అక్కడే నిలబడి పోయావేం నాయనా! లోపలికి రా అమ్మాయిని చూడు"— అంటూ, అప్పటికే లేచిన శ్రీధర్ అత్తగారు హెచ్చరించడంతో, అతనిలో చైతన్యం కల్గింది.

శారద గదిలోకి అడుగుపెట్టాడు శ్రీధర్. ప్రశాంతంగా నిద్రపోతున్న శారదని అమాయకంగా ఆమెను అంటిపెట్టుకొని పడుకున్న, ఎర్రగా బొద్దుగానున్న, పసిపిల్లను చూసి ఉప్పొంగిపోయాడు. కొన్ని క్షణాల క్రితంవరకు ఆమెను గురించి కలత

శ్రీధర్‌కి ఇది నిజమా అనిపించింది. సందేహం లేదు. ఇది కలకాదు. తన శారద క్షేమంగా ఉంది.

పక్కమీద చేరిన శ్రీధర్ మనస్సుని, విపరీతమైన గాలి దుమారం తగ్గిన తర్వాత ఏర్పడే ప్రశాంతత ఆవరించింది. తనిప్పుడు ఏ బాధాలేకుండా తేలికపడ్డ మనస్సుతో, హాయిగా పడుకుని ఉన్నాడంటే తనకే ఆశ్చర్యంగా ఉంది.

ఈ రాత్రి, తనీ ఇల్లు చేరేలోగా, తన హృదయం మీద ఎంత భయంకరమైన ముద్రవేసింది. కారుచీకటిలో, జోరున వానలో, దారి తెలీని గతుకుల రోడ్డుమీద కారుప్రమాదం, వసంత జ్ఞాపకాలు, శారదను గురించిన కలవరం,— అబ్బ! కొన్ని గంటల్లో ఎంత అనుభవం!

వసంత నిర్యాణం తన హృదయాన్ని గాయపరచినా క్షేమంగా ఉన్న శారద సాహచర్యంలో అది త్వరలోనే మానుతుంది. తాను వసంతకి అన్యాయంచేశాడు. నిజమే! దానికి తను మనఃపూర్వకంగా పశ్చాత్తాప పడుతున్నాడు. తన పశ్చాత్తాపం ఆమెను తిరిగి బ్రతికించకపోవచ్చు. కాని తన మానసిక దౌర్బల్యాన్ని కడిగేస్తుంది. ఆమె ఎడల తనకున్న నిర్మల భావాన్ని వ్యక్తం చేస్తుంది. ఆమె ఆత్మశాంతికి తనింతకంటే చెయ్యగలిగిందేముంది!

*   *   *

ఉదయం శారదకెదురుగా కూర్చున్న శ్రీధర్ ముఖాన్ని ప్రాతఃకాలపు ప్రశాంత ఆవరించింది.

"నిన్నరాత్రి నన్ను లేపలేదేం నాకు నిద్రాభంగం కల్గించడమంటే ఏమిటో ఎరుగరా"— మృదువుగా నవ్వుతూ అడిగింది శారద, ఒళ్లోనున్న పాప తలమీద వేళ్లతో రాస్తూ.

"అంత హాయిగా నిద్రపోతున్న నిన్నులేపి లేని పాపం తలకు చుట్టుకోడం ఇష్టంలేక. అయినా నేనింట్లో లేకపోయినా హాయిగా నిద్రపోగలవన్న మాట"— వేళాకోళంగానే అన్నాడు.

"ఇంతవరకూ ఏమోగాని ఇప్పుడింకేం ఫర్వా లేదులెండి. మా పాప ఉందిగా. ఇదయితే అల్లరి చెయ్యకుండా పడుకుంటుందికూడా"— ఎంతో ఆప్యాయంగా పసిదాని ఫాలభాగాన్ని ముద్దెట్టుకుంటూ అంది.

"అదీ చూస్తాగా కొంతకాలం పోనీ. అప్పుడు దాని బాధపడలేక నేనే నయమని పరుగెట్టుకొస్తావ్."

"ఇదేం అల్లరిది కాదులెండి మీలాగ........ బంగారుకొండ"—అంటూ పాప ఒళ్లంతా ముద్దుల వర్షం కురిపించింది.

"వ్రేలెడు లేదు. ఇంకా కళ్లేనా సరిగా తెరవలేదు. అదంటే ఇంత ప్రేమా, నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నాను, నన్నొక రోజేనా అలా ఆప్యాయంగా చూసావ్?"— తెచ్చి పెట్టుకున్న ఉక్రోషంతో అన్నాడు శ్రీధర్.

"చాల్లెండి మాటలు నేర్చారు. ఎవరైనా వింటారనేనా లేదు. పైగా అలా అరుస్తారేం." అని సున్నితంగా మందలించింది.

"మరి పాపకేం పేరుపెడదాం? ఈ కోపంలో శూర్పణఖలాంటి పేరుమాత్రం ఏరకండి, జీవితాంతం మనల్ని తిట్టుకుంటూ ఉంటుంది.—" మళ్లీ ఆమె అంది.

"నువ్వే చెప్పు."— ఆసక్తిగా ఆమె వైపు చూస్తూ అన్నాడు.

"ఊహూ మీరే చెప్పండి. ఆ హక్కులన్నీ భర్తకే ఇచ్చేసిందామె."

"వసంత."— పాపవైపు చూస్తూ అన్నాడు శ్రీధర్. శారద సంతృప్తిగా తలూపింది.

మధ్యాహ్నం భోజనాలైన తర్వాత శ్రీధర్ శారదతో మాట్లాడుతూ తన రాత్రి ప్రమాదం సంగతి చెప్పాడు.

"అమ్మయ్యో"— అంటూ శారద గుండెల మీద చేయి వేసుకుని, అప్రయత్నంగా మంగళ సూత్రాలను కళ్లకద్దుకుంది.

"ఇంకా నయం. కారుప్రమాదం జరిగికూడా ఏ కాలో చెయ్యో విరక్కుండా క్షేమంగా ఉన్నారంటే అదంతా భగవంతుని దయే." అని మనసులోనే భగవంతునికి భక్త్యంజలి ఘటించింది.

ఇంతసేపూ ఆమెవైపు చూస్తున్న శ్రీధర్ పైకి నవ్వేశాడు. నిజంగా కోపమొచ్చింది శారదకు.

"అంత గండం గడచి బయట పడ్డందుకు నేను సంతోషిస్తుంటే నవ్వుతావేం? అయినా కారు మీలాంటి మొండివాళ్ల చేతుల్లో ఉండవలసింది కాదులెండి. కొంచెం ఒళ్లు దగ్గరపెట్టుకునే వాళ్లకే కారు. మీకు లెక్కా పత్రమా ఇష్టంవచ్చిన వేగంతో కారు నడిపితే రోడ్డుమీద మనుషులు వడవాలా? ఇటువైపు రోడ్డుమీద వేగం అసలే పనికిరాదు. అసలా కారు అమ్మి వేయండి. అదిలేకపోతే గడవదా"

—గడ గడ ఆదేశాలిస్తున్న శారదను చూస్తే శ్రీధర్‌కి ముచ్చటేసింది.

"హియర్, హియర్, నా డ్రైవింగ్ మాటెలా ఉన్నా గొప్ప వక్తగా నువ్వు త్వరలోనే రాణిస్తావు. మహిళా మండలిలో ముఖ్యురాలివిగా నీకెందుకు పేరొచ్చిందో ఇప్పుడు నా కర్ధమైంది."

—ప్లేటు ఫిరాయించి చప్పట్లు కొడుతున్న శ్రీధర్ వైపు చిరుకోపంతో చూసింది శారద.

శ్రీధర్ లేచి నిలబడి,— "శారూ! ఇప్పుడు నాకు చాలా పనుంది. తర్వాత సావకాశంగా నీ లెక్చరు వింటాను. వెంటనే పట్నం పోయి మెకానిక్‌ను తీసుకుని, కారు బాగుచేయించి తీసుకురావాలి బై బై"— అంటూ, తనక్కడుంటే ఇంకేమైనా లెక్చరు దరిచేరేదేమోనని కళ్లుమూసి తెరిచే లోపలే బయటపడ్డాడు.

"జాగ్రత్త కొంచెం ఒళ్లు దగ్గర పెట్టుకు డ్రైవ్‌చెయ్యండి"— అన్న శారద హెచ్చరిక గాలిలో కలిసిపోయింది.

శ్రీధర్ పట్నం వెళ్లి, మెకానిక్‌ను వెంటబెట్టుకుని, టాక్సీలో తన కారు దగ్గరికి చేరుకున్నాడు. కారు బాగయేటప్పటికి చీకటిపడింది. మెకానిక్‌కీ, టాక్సీకి డబ్బిచ్చి పంపేసి కారును కూమారం వైపు మరల్చాడు.

"హుషారుగా డ్రైవ్ చేస్తున్న శ్రీధర్— 'నిన్న రాత్రికి ఈ రాత్రికి ఎంత తేడా' అనుకున్నాడు మనస్సులోనే

—ఆ వ్యత్యాసం కళ్లముందు మెదుల్తోంటే.

ముత్యాలు వెదజల్లినట్లున్న ఆకాశం, అంతటా విస్తరిల్లిన వెన్నెల వెలుగులు, సున్నితంగా పలకరిస్తున్న చల్లని గాలి. —వీటివల్ల ఎంతో ఆహ్లాదకరంగానున్న ఈ రోజు రాత్రికీ, మబ్బులు దట్టంగా క్రమ్మిన ఆకాశం, కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటి, కుంభపోతగా కురిసే వాన హోరు— వీటితో ఎంతో భయంకరంగా, తన పాలిట శనిగా దాపురించిన, నిన్నటి రాత్రికీ, — ఎంత తేడా!

తన మనసులో కూడా ఎంత ప్రశాంతత భయంకరమైన వూహలతో సతమతమైన నిన్నటి రోజుకీ, ఉత్సాహంతో ఉక్కిరిబిక్కిరౌతున్న ఈ రోజుకీ— ఎంత భేదం.

శ్రీధర్ టైం చూసుకున్నాడు. ఇంకొక పది, పదిహేను నిమిషాల్లో తను శారద సమక్షంలో ఉంటాడు. తనెంత అదృష్టవంతుడు! నిన్న ఆఖరవలసిన తన జీవితం ఇంకా ఎన్నో వసంతాలను ఎదురు చూడబోతోంది.

కారు వంతెన చేరింది. దాన్ని దాటే లోపలే 'ఫెళ ఫెళ'మంటూ కర్రవంతెన కూలిపోయింది. రాత్రంతా వానకు నాని, పుచ్చిన కర్రస్తంభాలతో నిర్మించిన వంతెన, కారు వేగానికి తట్టుకోలేక, శ్రీధర్‌ను తనతోనే చేర్చుకుని, జీవయాత్ర చాలించింది. ★





## జ రి గి న క థ

అదృష్టం వున్నా, ఆనందానికి నోచుకోని వృద్ధమూర్తి సుబ్బయ్య. బదిలీ అయిన వ్యవసాయ డెమాన్స్ట్రేటర్ రామారావుకు వాళ్లయింట్లో గది అద్దెకు దొరుకుతుంది. విపరీత పరిస్థితుల్లో తారసపడిన ప్రసాద్‌ను దుర్గయ్య ఆదరిస్తాడు. అనుకోకుండా అతనికి విమల, కమలలతో పరిచయ మౌతుంది. రామారావు గీసిన చిత్రాలను విమల మెచ్చుకొంటుంది. కమలను చూచిన ప్రసాద్ ఆమెమీదనే తన దృష్టిని లగ్నం చేస్తాడు. రామారావుకు హిందీ నేర్పటానికి సుబ్బయ్యగారు, విమలను నియోగిస్తారు. కమల, ప్రసాద్‌లు సన్నిహితులవుతారు. కాని, ఆమాట విని, సుబ్బయ్యగారు మండిపడ్తారు—కమల మనస్సును మార్చటానికి ఆయన ప్రయత్నం ప్రారంభిస్తాడు. ప్రసాద్ సాహసంచేసి గోడదూకి కమలను కలిసికొన్నా, ఇంతలో రవికుమార్ రావటంవల్ల, మాయోపాయంతో వీధిలోకి రాగలిగాడు. రామారావు విమలను వివాహం చేసికొంటానంటాడు. సుబ్బయ్యగారింట్లో జరిగిన దొంగతనానికి—కమల ప్రసాద్‌ను అనుమానిస్తుంది. దొంగ ఆచూకీ తీయాలని ప్రసాద్ ప్రయత్నాలను ప్రారంభిస్తాడు.

(గతసంచిక తరువాయి)

సుమారు ఎనిమిదిగంటలప్పుడు 'వాను' వచ్చి మేడ ముందు ఆగింది. అందులోంచి గంగరాజు దిగాడు. 'వాను'లో మరి ఇద్దరు వ్యక్తులున్నారు. అది ప్రభాత్ సర్కస్‌కి చెందిన 'వాను'. తరువాత వాను వెళ్లిపోవడం, గంగరాజు లోపలికి వెళ్లడం జరిగింది.

మరొక పది నిముషాలలో కారియర్లు పట్టుకుని నౌకరు బయటికి వచ్చి, వూరి వైపు నడువనారంభించాడు. అంటే మరొక గంటదాకా వాడు తిరిగి రాడన్న మాట.

ప్రసాద్, రామం, నళినీ నౌకరు కొద్దిగా దూరం వెళ్లేదాకా ఆగి, తరువాత మేడవైపు నడిచారు. నళిని సహాయంతో, ప్రసాద్, మేడ మీదకు వెళ్లిన వ్యక్తే గంగరాజని మరొకసారి నిర్ధారణ చేసుకున్నాడు. "ఆడే బాబు. దొంగ సచ్చినోడు. నన్నన్యాయం సేసేసి నాడు". అంది నళిని అతను 'వాను' దిగినప్పుడే.

మేడమీద గదిలో బట్టలు మార్చుకుంటున్న గంగరాజుకి దగ్గరగా వేసి ఉన్న గదితలుపులు తోసుకుని ఇద్దరు యువకులూ, ఒక యువతీ ప్రవేశించడం ఆశ్చర్యం కలిగించినా, నళినిని చూడగానే, ఆమె తరఫు వ్యక్తులెవరో వచ్చి ఉంటారని అనుకున్నాడు. ఇలాంటి సమయంలో నళినిని గుర్తుపట్టి పలకరించడం కన్నా, ఆమె ఎవరో తనకు తెలియనట్లు నటించడం మేలనుకున్నాడు కాబోలు "మీరెవరు ? ఎందుకొచ్చారు ?" అని బొంగురు

గొంతుకతో అడిగాడు.

"మేమెవరమో వేరే చెప్పక్కరలేదు. ఈ అమ్మాయిని నువ్వెరుగుదువా ? లేదా ? ఒక వేళ ఎరుగనని దబాయిద్దా మనుకుంటున్నావేమో, నీ సంగతి మాకంతా తెలుసు." అన్నాడు ప్రసాద్.

"ఈ అమ్మాయినా ? నాకు తెలియదే !"

"అవునవును పాపం ! ఏమీ తెలియదు ! దొంగతనం కూడా తెలియదు. తప్పించుకు పారిపోదా మనుకుంటున్నావు కాబోలు జాగ్రత్త."

"ఏయ్, అసలు మీరెవరు ? మీ కిక్కడేం పని ?"

"ఇదిగో, దబాయింపు కట్టిబెట్టి, నీ పెట్టెలు తీసి చూపించు. రామం, ఆ పెట్టె వెదుకు." అని ఆజ్ఞాపించాడు ప్రసాద్. రామం ముందుకువెళ్తూంటే గంగరాజు అంతవరకూ కోపంగా ఉన్నవాడు హఠాత్తుగా, ముఖ కవళికలు మార్చేసి నవ్వసాగాడు. "బలేవారేనే మీరు. నా గదిలో నన్నే జడిపిస్తున్నారు" అని "అసలు మీకేం కావాలో చెప్పండి ?" అన్నాడు. అంటూ ప్రసాద్ దగ్గరకి వచ్చాడు.

ప్రసాద్ అతని వైపు తీవ్రంగా చూస్తూ, "ఏయ్, మిస్టర్ నువ్వు అవక తవక వేషాలు వేశావంటే జాగ్రత్త !" అని జేబులోంచి, ఎందుకైనా మంచి దని దుర్గయ్య గారిచ్చిన, బాకుతీసాడు. దాని వైపు ఒక్క క్షణం చూశాడు గంగరాజు. అతనికి ఎదురుగా ప్రసాద్ ఉన్నాడు; నళిని ప్రసాద్ వెనకాల ఉంది. రామం గదిలో ఒక మూలగా ఉన్న పెట్టె వద్ద ఉన్నాడు.

"మిస్టర్ ! నీకు కావల్సిందేమిటి ?" అని శాంతంగా అడిగాడు గంగరాజు.

"ఆ పెట్టె తెరిచి చూపించు. అందులో సుబ్బయ్యగారి నగలుంటే సరేసరి, లేకపోతే ఎక్కడ దాచావో చెప్పు" అన్నాడు ప్రసాద్.

"పెట్టె తీసి చూపించాలి కదా. సరే. తాళం చెవులు ఈ కోటు జేబులో ఉన్నాయి" అంటూ గోడకు తగిలించి ఉన్న హేంగర్ వద్దకు వెళ్ళి, కోటు జేబులో చెయ్యిపెట్టూ, 'హేంగర్' ప్రక్కనే ఉన్న 'స్విచ్చి' నొక్కేసాడు.

హఠాత్తుగా లైటారిపోవడం, నళిని కెవ్వుమని కేకెయ్యడం, ప్రసాద్ డొక్కలో గంగరాజు తన్నిన తన్నుకు, ప్రసాద్ "అబ్బ"! అని, చేతిలోని బాకు వదిలేసి క్రింద కూర్చోడం ఒకసారిగా జరిగాయి.

రామం గబుక్కున గోడ వద్దకు పరిగెత్తి, స్విచ్చి వేసేసరికి లైటు వెలిగింది. గంగరాజు చేతిలో బాకుంది. ప్రసాద్ క్రింద పడి ఉన్నాడు, స్పృహ లేకుండా.

"ఏయ్! ఆ తాడిలా తెచ్చి, వీడి కాళ్ళూ చేతులూ కట్టేయ్." అని రామాన్ని ఆజ్ఞాపించాడు గంగరాజు, చేతిలోని బాకు చూపిస్తూ. నళిని ఏడవసాగింది.

"నేను కట్టను" అన్నాడు రామం మొండిగా.

"ఇది చూశావా ! ఒక్క పోటుతో నువ్వూ వాడూ స్వాహా. ఊ ! తొందరగా కానీ" అని గద్దించాడు.

అతను చెప్పినట్టు చెయ్యకపోతే, బాకుతో పొడిచేస్తాడని రామానికి భయం వేసింది. అయిష్టంగా మెల్లిగా అక్కడున్న బెడ్డింగు తాడు తెచ్చి, ప్రసాద్‌ని మెల్లిగా కట్ట నారంభించాడు.

నళిని, "హోమ్మ !" అని ఏడవసాగింది.

గంగరాజు, నళిని వైపు తిరిగి, "ఏడవకే, చిలకా! నిన్ను నే నొదిల్నా నన్ను నువ్వొదిలావుకావు. ఈ సారి మద్రాసు పోదాంలే", అని నవ్వాడు.

రామం, పడి ఉన్న ప్రసాద్ కాళ్ళు తాడుతో కట్టూ, ఎద్దైనా అవకాశం వస్తుందేమో గంగరాజు మీద తన పగ తీర్చుకొందామని చూస్తున్నాడు. కాని రామం ఉద్దేశం గ్రహించి గంగరాజు, రామం నెత్తి మీద ఒక దెబ్బ కొట్టేసరికి రామం పడిపోయాడు.

గంగరాజే, గబగబ తాళ్ళతో ప్రసాద్‌నీ రామాన్నీ కట్టేసి, వాళ్ళనోటిలో గుడ్డలు కుక్కేశాడు. "నిన్నొదిలి పెట్టడం నాదే పొరపాటే, చిలకా ! పద! ఈ సారి నిన్నొదల్నులే." అని బట్టలు వేసుకోవడం ప్రారంభించాడు. నళిని తను అక్కణ్ణుంచి పారిపోతే మంచి దని, మెల్లిగా వెనక్కి నడుస్తూంటే, గంగరాజు గబుక్కున వెళ్ళి ఆమెను పట్టుకున్నాడు.

"ఎక్కడికెళ్తావే చిలకా ? నిన్నొదల్నని చెప్పానుగా." అని ఆమెను అక్కడున్న కుర్చీ మీదకూలేసాడు. నళిని ఏడుస్తూ, అతనిని తిట్టసాగింది. ఆ సమయంలో నౌకరు ప్రవేశించి, "సార్, భోజనం తెచ్చాను." అని కారియర్ అక్కడ పెట్టాడు. నళినినీ, క్రింద తాళ్ళ కట్టుతో పడిఉన్న ఇద్దర వ్యక్తుల్నీ చూసాడు. ఆశ్చర్యం ప్రకటించాడు.

"వీళ్ళిద్దరూ దొంగలు. నన్ను దోచుకోవాలని వచ్చారు. వాళ్ళని తాళ్ళతో కట్టి పడేశాను. ఈ అమ్మాయి, మాకు తెలిసిన వాళ్ళమ్మాయి. వీళ్ళ మాయలో పడి వీళ్ళవెనకాల వచ్చేసింది. ఇప్పుడు పన్నెండు గంటల బండీలో, ఆమెను తీసికెళ్ళి వాళ్ళవాళ్ళ కప్పజెప్పి, రెండు రోజుల్లో వస్తాను. నువ్వు తెల్లవార్లూ వీళ్ళకు కాపలాకాసి, తెల్లవారేక పోలీసుల కప్పగించు." అని గంగరాజు, నౌకరుతో చెప్పాడు.

"చిత్తం సార్ !" అన్నాడు నౌకరు.

గంగరాజు టైము చూసుకున్నాడు. అప్పటికి తొమ్మిదిన్నర అయింది. బట్టలు వేసుకుని సిద్ధమయ్యాడు. పద నిముషాలలో భోజనం ముగించాడు. తను మెల్లిగా బయల్దేరి వెళ్తే, అక్కడికి అయిదు మైళ్ళ దూరంలో వున్న 'గంగవాడ రోడ్డు' రైల్వే స్టేషన్ వడిచి చేరుకొనే సరికి రైలు టైమవుతుంది. ఆ రైలులో తిన్నగా కలకత్తా వెళ్ళి, వీలైనంత తొందరగా నగల్నమ్మేయ్యాలని నిశ్చయించాడు. తను ఆ నగలతో ఆ చుట్టు ప్రక్కల వుండడం, క్షేమం కాదనీ, నళినిని వదిలి పెట్ట కూడదనీ నిశ్చయించాడు.

నళినిని భోజనం చెయ్యమంటే భోజనం చెయ్యలేదు. తరువాత ఆమెను దారిలోకి తీసుకు రావచ్చు నని, ఆమెను బలవంతపెట్ట లేదు. మరొక పది నిముషాలలో, నళినిని తీసుకుని బయల్దేరాడు. పడివున్న ప్రసాద్‌నీ, రామాన్నీ ఒకసారి చూశాడు. అరగంట అయినా వాళ్ళకు తెలివి వచ్చి పట్టు లేదు. "మచ్చు ఘటాలు !" అనుకుని గదికి తాళం వేశాడు. తను ఒక చేత్తో పెట్టె పట్టుకున్నాడు. ఇంకొక చేత్తో నళినిని పట్టుకున్నాడు. బయట చీకట్లో స్టేషన్ వైపు సాగిపోయాడు.

గంగరాజు వుద్దేశంలో వాళ్ళిద్దరూ చిన్న తరహా దొంగలని, నళినికి పరిచయమున్నవాళ్ళనీ, నళిని ద్వారా తన గురించి తెలుసుకుని, తన వద్ద ఆ నగల కొట్టెయ్యడానికి వచ్చారనీ, తోచింది. అందుకే వాళ్ళని కట్టేసి, తను మెల్లిగా నగలతోనూ నళిని తోనూ మాయమైతే వాళ్ళే నోరు మూసుకుని వుంటారని అనుకున్నాడు.

అతను వెళ్ళిన పది నిముషాలకు ఇద్దరికీ తెలివొచ్చింది. ఒకరి కొకరు ఆరడుగుల దూరంలో వున్నారు. ఒకరినొకరు చూస్తున్నారు. గాని నోటితో మాట్లాడలేరు. గది ఖాళీగా వుండడం చూశారు. మెల్లిగా కదిలి ఒకరి దగ్గరికింకొకరు వచ్చారు. గదిలో ఒక కుర్చీ మాత్రం వుంది. గది తలుపు వేసుంది. లైటు వెలుగు తోంది. గంగరాజు లైటార్పడం మర్చిపోయాడు. అందుకని గదంతా స్పష్టంగా కన్పిస్తోంది.

ప్రసాద్, రామం ఇద్దరూ కళ్ళతో సంజ్ఞలు చేసుకుంటూ, తమ కట్లు విప్పటానికి ఏదైనా ఆస్కారం దొరుకుతుందేమోనని చూశారు. ఏదీ కన్పించ లేదు. చివరికి ప్రసాద్ రామంని కదల వద్దని, తను మెల్లిగా దేకుకుంటూ తన కాలి వేళ్ళతో రామం నోటి వద్ద కట్ట బడిన గుడ్డను లాగ సాగాడు. అది పల్చని గుడ్డవటం వల్ల కొద్దిసేపు ప్రయత్నించేసరికి ముడితో సహా బయటికి వచ్చేసింది. మళ్ళీ కొద్దిసేపు కాలి వేళ్ళతో ప్రయత్నించి, రామం నోటిలోని గుడ్డని లాగేశాడు. రామం నోరు కదిపి చూసుకుని, " సార్ ! " అన్నాడు. ప్రసాద్ అప్పుడు మెల్లిగా తన తలని రామం నోటి వద్దకు తెచ్చాడు. రామం, తన పళ్ళతో ప్రసాద్ నోటికి కట్టిన గుడ్డను కొరికి లాగేశాడు. ప్రసాద్ నోట్లోని గుడ్డ కూడా, తన పళ్ళతో తీసేశాడు. ఇద్దరికీ నోళ్ళు తెరవ బడ్డాయి.

" ఈ కట్లెలాగ సార్ ! " అన్నాడు రామం.

" అదే ఆలోచిస్తున్నాను. కొరకడానికి సాధ్యంగా లేవు " అన్నాడు ప్రసాద్ ఆలోచిస్తూ. అతనిది బెడ్డింగు తాడు. రామాన్ని కట్టింది వాంతాడు. ఒక్క నోరు తప్ప మరే అంగమూ వారి స్వాధీనంలో లేదు. " నీ జేబులో ఏదైనా పదునైన వస్తు వుందా ? " అని రామాన్ని అడిగాడు.

" లేదు సార్." అన్నాడు రామం.

" ఏ వస్తువా లేదా ? "

" అగ్గి పెట్టుంది సార్."

" అగ్గి పెట్టా ! " అని కొద్దిసేపు ఆలోచించాడు. గదిలో అక్కడక్కడా చిరిగిన కాగితాలున్నాయి. " సరే నేను చెప్పినట్లు చెయ్యి." అని ఆ చింకి కాగితాలన్నిటినీ ఒక చోట, డేకు కుంటూపోగు చేయించాడు. రామం జేబులోంచి, మెల్లిగా తన నోటితో అగ్గి పెట్టి తీశాడు. రామం ప్రసాద్ ఊహ గ్రహించి, మెల్లిగా తన నోటితో పుల్లల్ని తీశాడు. ప్రసాద్ పెట్టెను నోటితో గట్టిగా పట్టుకున్నాడు. రామం నోటితో పుల్లను పట్టుకుని గీశాడు. ఒక పావు గంట ప్రయత్నించాక పుల్ల వెలిగింది.

వరసగా నాలుగైదు పుల్లలు వెలిగిస్తూంటే, అవి మండి ఆరిపోవడమే గాని ప్రయోజనం కన్పించ లేదు. తరువాత గీసిన పుల్ల, క్రింద పడివున్న నాలుగైదు పుల్లల మీద పడి ఒక్కసారి అవీ, కాగితాలూ మండ నారంభించాయి, ఆ మంటకు తన చేతులను దగ్గరగా తెచ్చాడు. రామం, అతని చేతికి కట్టిన

# మనసున మల్లెలు

చాంతాడు అంటుకుని కాల సాగింది. మధ్య త్రాడు కాలి పోగా రామం చేతులు రెండూ స్వాధీన మైయ్యాయి. వెంటనే గబగబ తన కట్లు విప్పేసు కుని ప్రసాద్ కట్లు కూడా విప్పేశాడు.

ఇద్దరూ "హమ్మయ్య !" అనుకున్నారు.

గది తలుపు వద్దకు వెళ్లి, అది బయట తాళం వెయ్యబడి ఉందని గ్రహించారు. గదిలో ఒక చిన్న కిటికీ ఉంది. ఇద్దరూ తమ బలాన్ని ఉపయోగించి దాని ఊచలు లాగేశారు. ఆ కిటికీ సరిగ్గా గోడ మీద ఉంది. దానిలోంచి చూస్తే క్రింద ఇరవై అడుగుల దాకా గోడ ఉంది. ప్రసాద్ తనని కట్టిన తాడు, గదిలోని కుర్చీకి ఒకవైపు కట్టి, ఆ కుర్చీ మీద రామాన్ని దబాయించి కూర్చోమని రెండో వైపు కిటికీ బయటకు విసిరేశాడు. దాని సాయంతో ఆ కిటికీ మీద నుంచి జారి, దిగుదామనుకున్నాడు. రామానికి కట్టిన తాడు కూడా ఆ తాడుకు ముడి వేశాడు. కాని కొంత దూరం జారేసరికి ఆ త్రాడు తెగి 'దబ్బు'మని క్రింద పడ్డాడు ప్రసాద్. సుమారు పది అడుగుల ఎత్తు మీద నుంచి పడ్డాడు. కొద్దిగా కాలు బెణకడం, చిన్నచిన్నగాయాలు తగలడం జరిగింది.

వెంటనే లేచి వాకిలి ద్వారం వద్దకు వెళ్లాడు. అక్కడ వాచ్‌మెన్ హాయిగా నిద్రిస్తున్నాడు. వాడి జేబులు తడిమి గది తాళం తీసాడు. వాడు గాఢ నిద్రలో ఉండి లేవలేదు. వెంటనే మేడమీద గది తాళం తీసి, రామం తనూ బయటకు వచ్చేసారు.

గంగరాజు, నళినిని తీసుకుని స్టేషనుకి వెళ్లి ఉంటాడనీ, ఆమెతో, "మద్రాసు వెళ్దాం" అని అనడం తను విన్నాననీ రామం చెప్పాక, ఇద్దరూ స్టేషను వైపు పరిగెత్తారు. అప్పటి కప్పుడే పద కొండు దాటింది.

"సార్ ! స్టేషను చాలా దూరముంది సార్ ! వాడు వెళ్లి రెండు గంటలైనా అయి ఉంటుంది. వాడు కలకత్తా బండిలో వెళ్తే మన కందడు సార్ !" అన్నాడు రామం పరిగెట్తూ, ప్రసాద్‌తో.

"పోనీ మన శాయశక్తులా పరిగెట్టి స్టేష నుకి చేరుకుందాం. రైలు అందితే సరేసరి. లేక పోతే ఆ స్టేషను నుంచి, ఏ పెద్ద స్టేషనుకైనా, ఆ రైలులో దొంగ ప్రయాణం చేస్తున్నాడని ఫోను చేయిద్దాం." అన్నాడు ప్రసాద్ రొజుతూ.

రాత్రిపూట చీకట్లో పరిగెట్టడం కష్టమైన పని. అందులోనూ అంతకు ముందు బాగా దెబ్బలు తగిలి ఉన్న శరీరాలూ, అలిసి పోయిన శరీరాలూ, కావడం వల్ల అడుగు ముందుకు పడడం ఇద్దరికీ కష్టంగా ఉంది. టైము దగ్గర దగ్గర పన్నెండ వస్తోంది. దూరం ఇంకా ఎలా లేదన్నా, నాలుగు మైళ్ళుంటుంది. ఇద్దరు కసిగా పరిగెడుతున్నారు గాని, ఎక్కడా శక్తి లేదు. తూలిపడిపోతామేమో అని కూడా భయంగా ఉంది వారికి. ఆ సమయంలో వెనక నుంచి వారి మీద కారులైటు పడింది. పరి గెడుతున్న ప్రసాద్, రామం ఒక నిముషం నిలబడ్డారు. కారులైటు తమ మీద పడ్తోందని, అలాంటప్పుడు తాము పరిగెట్టడం మంచిది కాదని, కారు వెళ్లి పోయాక మళ్లీ పరిగెత్తచ్చనుకున్నారు.

కారు మెల్లిగా వారున్న చోటుకి వచ్చి ఆగింది. అందులోంచి తలుపుతీసి బయటకు వచ్చిన వ్యక్తిని చూచి, ప్రసాద్ ఆశ్చర్య పోయాడు. రామా రావు ! "హల్లో ప్రసాద్‌గారూ ! ఇక్కడున్నా రేమిటి ?" అన్నాడు. వెంటనే మూడు ముక్కల్లో ప్రసాద్ ఆయనికి జరిగిందంతా చెప్పాడు. అది వినగానే "పదండి స్టేషనుకు కారు మీద వెళ్దాం." అని ప్రసాద్‌నీ, రామాన్నీ కారులో ఎక్కించు కున్నారు. కారులో రామారావుగారితో పాటు మరిద్దరు వ్యక్తులున్నారు. అందులో ఒకరు లాయరు నాగభూషణంగారు, మరొకరు రిటైర్డు సూపరెంటెండ్ ఆఫ్ పోలీసు రామానుజరావు గారు.

"మేము విశాఖపట్నం నుంచి బయల్దేరి రామ నగరం వెళ్తున్నాం. గంగువాడలో కొద్దిగా పనుండి అక్కడికి వెళ్లి వస్తున్నాం. ఇక్కడ కారు లైట్లలో మీరు స్పష్టంగా కన్పించారు. దాంతో కారాపిం చాను" అని రామారావు ప్రసాద్‌తో చెప్పాడు. కారు గంగువాడ రోడ్డు స్టేషను వైపు రివ్వుమని సాగిపోయింది.

## 17

ఆ రోజు ప్రొద్దుటి జపం ముగించుకుని, హాల్లో ఫలహారం చేస్తున్న సుబ్బయ్యగారికి, దొంగ దొరికా డనీ, కొద్దిసేపట్లో పోలీసు స్టేషనుకు వచ్చి, దొరికిన నగల్ని గుర్తించాలనీ, పోలీసు స్టేషను నుంచి కబురు వచ్చేసరికి బ్రహ్మానందం కలిగింది. వెంటనే కూతుళ్లను పిల్చి ఆ విషయం చెప్పారు.

దొంగ ఎలా దొరికాడో కనుక్కుందామని పోలీసు స్టేషనుకు బయల్దేరారు. ఆయన గుమ్మం దిగి, కొన్ని అడుగులు వేసేసరికి, రామారావు ఎదురుపడి, "మీకోసమే వస్తున్నాను. మా నాన్న గారు వచ్చారు" అని చెప్పి, ఆయన గదికి తీసుకు వెళ్లారు.

కమల మేడమీద గదిలో ఒక్కర్తీ కూర్చొని ఆలోచిస్తోంది. ఆమె మనసు చాలా కల్లోలయుతంగా ఉంది. గత ఇరవైనాలుగు గంటలలోనూ ఆమె చాలా కొత్త విషయాలు వింది. వాటిని తల్చు కుంటూంటే ఆమెకు ఒక వైపున ఎంత సంతోషం కలుగుతోందో, మరొకవైపున అంతకు రెండింతలు విచారం కలుగుతోంది. అందుకు కారణం కను క్కోవాలంటే అంత క్రితం రోజు జరిగిన విష యాల్ని విపులంగా చెప్పాలి.

ప్రసాద్, నళినీ, రామం, గంగువాడ వెళ్లి అక్కడ హోటల్లో భోజనం చేస్తున్న సమయంలో రామనగరానికి మద్రాసు వైపు నుంచి వచ్చే రైలు లోంచి ముగ్గురు వ్యక్తులు దిగారు. వారిలో ఇద్దరు స్త్రీలు. ఒకరు పురుషుడు. స్త్రీలకు వయస్సు ఏభై దాటి ఉంటుంది. ఒకామె విధవ. రెండవ యామె కొన్నాళ్ల క్రితం రామనగరం మీదుగా, తన పిల్లలతో మద్రాసు వెళ్లిన జగదాంబగారు. ఆమె ఈ సారి పిల్లల్ని తీసుకు రాలేదుగానీ, అప్పుడు తీసుకెళ్లిన ఫ్లాస్కు తీసుకు వచ్చేసింది. పురుష వ్యక్తికి ముప్ఫై ఏళ్లుంటాయి. ఒడ్డూ, పొడుగ్గా, సూటులో దర్జాగా ఉన్నాడు.

ముగ్గురూ రైలు దిగి సుబ్బయ్య గారింటికి వెళ్లారు.

హాల్లో ఎదురైన సుబ్బయ్యగార్ని ముందర జగదాంబగారు పలకరించింది. "ఏమండోయ్,

రూప యొక్క రూపము... నేడు కూడా మనోహరముగా వుంది !

ఇరవై సంవత్సరాల క్రితము, రాజు మొదటి సారి రూపని కలుసుకున్నప్పటి మాట. రూప యొక్క రూపము లావణ్యము అతని కండ్లలో వెన్నెలవలె ప్రకాశించి మెలసినవి. కొన్ని దినముల తర్వాత అతడు, ఆమె వివాహము చేసుకొన్నారు. ఆ పతి పత్ని ప్రేమ నేటికి కూడ తగ్గలేదు. నేటికి కూడ రూప అంత అందముగానూ వున్నది. ఎందు కంటే ఆమె ఎల్లప్పుడు హేజలైన్ స్నోనే వాడుచున్నది. హేజలైన్ స్నో తమ ముఖము యొక్క చర్మమును మృదువుగాను కాంతివంతముగాను చేయును. దీని మీద పౌడరు చాల సేపటివరకు అద్ది వుండును.




## 'హేజలైన్' స్నో సౌందర్యమును నిలబెట్టును.

హేజలైన్ కోల్డ్ క్రీమ్ మరియు హేజలైన్ టాల్కమ్ పౌడర్ కూడ దొరుకును.



బర్రోస్ వెల్కం & కంపెనీ (ఇండియా) లిమిటెడ్,
పి. ఒ. బాక్సు 290, బొంబాయి-1.

81-BW-16

మీ పాత మిత్రుల్ని తీసుకొచ్చాం. వీరెవరో మీకు జ్ఞాపకముందా ?'' అని తనతో వచ్చిన స్త్రీనీ, పురుష వ్యక్తినీ చూపించింది.

సుబ్బయ్యగారు ఒక్క నిముషం ఆమె వైపు చూసి, ''ఆ !'' అని ''ఎన్నాళ్లకు ! ఎన్నాళ్లకు ! చూసుకున్నామమ్మా !'' అని కంటి నీరుతో, గద్గద కంఠంతో, ''అయితే నా స్నేహితుడు నన్ను వదిలి వెళ్లిపోయాడా ?'' అని కండ్ల వెంట నీరు కార్చ సాగారు. కొద్ది నిముషాలాగి, ''ఎన్నాళ్లయింది ?'' అని అడిగారు.

జగదాంబగారు, ''పదేళ్లయింది. అదిగో అతను ఆమె పెద్ద కొడుకు. వీరికీ, మాకూ కలకత్తాలో బాగా పరిచయం. మొన్న నేను మద్రాసు నుంచి బెజవాడ వచ్చి వీరింట్లోనే దిగాను. అక్కడ మీ ప్రస్తావన వచ్చి, 'చాలా కాలమైంది వారి కుటుంబాన్ని చూసి' అన్నారు. వెంటనే ఒకసారి చూడాలని నిశ్చయించి బయల్దేరాం.'' అంది.

సుబ్బయ్యగారు, ''చాలా సంతోషమమ్మా కరుణాకరంగారి గురించి ఎన్నాళ్లో నేను కొట్టుకు పోయాను. కాని ఆయన సంగతి నాకెవరూ చెప్ప లేదు. మీకూ వారికీ పరిచయం ఉందనే విషయమే తెలియదు.'' అని వారందరినీ ఇంట్లోకి తీసుక వెళ్లారు. తన భార్య వద్దకు వెళ్లి, ''నీకోసం, మీనాక్షమ్మగారు వచ్చారు.'' అన్నారు ఆమె మంచ మీదున్న మనిషి మెల్లిగా లేవబోయింది. మీనాక్షమ్మ గారు, ''వదినా ఎన్నాళ్లయింది నిన్ను చూసి,'' అని ఆమెను కౌగలించుకుంది. కొద్దిసేపు వారిద్దరూ మాట్లాడుకున్నాక, సుబ్బయ్యగారి భార్య కూతుళ్లని పిలిచి ''మీరు పుట్టక ముందు నేమిద్దరం స్నేహితురాళ్లం. ఈమె భర్త కరుణాకరం గారు, మీ నాన్నగారికెంతో సాయం చేశారు.'' అని చెప్పి కమలనీ, విమలనీ, రవికుమార్‌నీ పరిచయం చేసింది.

''అప్పుడు మీకొక అబ్బాయి ఉండేవాడు''

''అవును వాడే నాతో ఇప్పుడు వచ్చాడు. సుధాకర్ ! డాక్టర్ పరీక్ష పాసయి బెజవాడలో ప్రాక్టీసు చేస్తున్నాడు. రెండో వాడు, ఇరవై రెండేళ్లవాడు బి. ఏ. పాసయ్యాడు.

''రెండో అబ్బాయిని తీసుకు రాలేదా ?'' అంది సుబ్బయ్యగారి భార్య.

''లేదమ్మా. వాడు వట్టి ఆకతాయి మనిషి వాళ్లన్నయ్య, నేనూ, ఏదో కేకలేశామని, మామీద అలిగి రెండు నెలల క్రితం ఇంట్లోంచి పారిపోయాడు. అప్పటి నుండీ ఎంత ప్రయత్నించినా ఎక్కడా కన్పించలేదు. మొన్న జగదాంబగారు వచ్చి, వాడీ వూళ్లో ఉన్నాడని చెప్పారు.''

''ఈ ఊళ్లోనా ?'' అన్నారు కమలా, విమలా, వాళ్లమ్మా ఒక్కసారి.

జగదాంబగారు, ''అవును ఈ వూళ్లోనే. అవాళ మీరు నా కోసం స్టేషనుకు వచ్చినప్పుడు చూసాను. అతనే రైలు వెళ్లి పోతూంటే, పరిగెత్తి వెళ్లి ఆపి నాకు చాలా సాయం చేశాడు. క్రిందటి సారి చూసినప్పటికన్నా బాగా ఎదిగాడు అందువల్ల ముందు గుర్తించలేక పోయాను కాని తరువాత గుర్తించాను.''

కమలా, విమలా ఒక్కసారిగా. ''ఆయనా !'' అని ఒకరి మొహం ఒకరు చూసుకోనారంభించారు.

''ఏం ? వాడు మీకు తెలుసా ?'' అంది మీనాక్షమ్మ తత్తరగా.

విమల ఏదో అనబోయి ఆగి, చెల్లెలి వంక చూసింది. కమల ఏదో అందామని, అక్కవైపు చూసి ఆగింది. ఇద్దరూ ఆమె వైపు చూసి, ''అబ్బే ! ఏం లేదు !'' అన్నారు.

ఇద్దరి మొహాలలోనూ చాలా మార్పు రావడం జగదాంబగారు గమనించింది. అప్పటికి ఏమీ అనకుండా, ''అతను ఎక్కడ ఉంటాడో తెలుస్తే బాగుండును.'' అని వూరుకుంది. తక్కిన వారు కనుక్కుంటా మన్నారు.

వచ్చిన వారు స్నానపానాలు అవీ చేశాక, విశ్రాంతి తీసుకో నారంభించారు. అప్పటి కప్పుడే సుధాకర్ ఒకసారి వూరంతా తిరిగి వచ్చి, తమ్ముడు ఎక్కడా కన్పించలేదని చెప్పాడు ! తల్లితో. సుబ్బయ్యగారితో భోజనాల వద్ద ఈ విషయం చెప్తే, తను కూడా వాకబు చేస్తానన్నారు. కాని ఆయనికి కరుణాకరంగారి అబ్బాయే, కమలను ప్రేమించిన యువకుడనే విషయం తెలియలేదు. ఎందుకంటే స్టేషనులో జరిగిన సంఘటన ఆయన కెవరూ చెప్పలేదు. అందువలన ఆ కుర్రాడింకెవరో అనుకున్నారు. అసలింత వరకూ ఆయన ప్రసాద్‌ని ప్రత్యక్షంగా ఎరుగరు.

---

ఒక పెద్దమనిషి : మీ ఇంట్లో పిల్లలంతా పరీక్ష పాసైనారా అండీ !

రెండో పె. మ. మా యింట్లో పదిమంది స్కూల్లో చదువుతున్నారు. అందులో నలుగురు మాత్రమే పాసైనారండి !

మొదటి పె.మ. ఫరవాలేదండీ మీకు పాస్ మార్కు వచ్చింది గదండీ !

ఎం. రాంమోహన్‌రావ్ (తెనాలి)

---

భోజనాలయ్యాక మేడమీద గదిలో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, జగదాంబగారు మెల్లిగా విమల నొక్కర్తినీ తన వద్ద కూచో పెట్టుకుని ప్రసాద్ విషయం మళ్లీ అడిగింది. విమల, ప్రసాద్ కమలా ఒకరి నొకరు ప్రేమించుకున్నారనీ, కానీ ప్రసాద్ ఎవరో తెలియక పోవడం వల్లసుబ్బయ్య గారు, అందుకెంత మాత్రం అంగీకరించక, కమలకు వేరే ఒక గొప్పసంబంధం నిర్ణయించారనీ, పెళ్లి వారు ఆ మర్నాడే వస్తున్నారనీ, చెప్పేసింది. సాయంకాల మయ్యేసరికి మీనాక్షమ్మ గారికి, జగదాంబగారి ద్వారా తెలిసింది. ఆమె ''అయ్యో ! ఎంత పని జరిగింది ! కమల మా కోడలైతే ఎంత బాగుండును !'' అనుకుంది.

ప్రసాద్, ఆ వూరల్లా వెదికినా కన్పించక పోయేసరికి, సుధాకర్, నిరాశ జెంది, అసలు ప్రసాద్ ఆ వూరు వదలి వెళ్లిపోయేడేమోనని అనుమానించాడు. ఆ రోజు రామారావుగారు కూడా వూళ్లో లేరు. అందువల్ల విమల, రామారావుగారికి ప్రసాద్ విషయం తెలుసుననీ ఆయన వూరు నుంచి రాగానే ఆయనను కనుక్కోవచ్చుననంది. ఆ రాత్రి అందరూ కలత మనసులతో నిద్రించారు. కమలకు అసలు నిద్ర పట్టలేదు.

ఆమె దృష్టిలో, ప్రసాద్ గురించి ఉన్న అపోహలు మీనాక్షి గారి రాకతో తొలగి పోగానే, అతను చాలా గొప్పవ్యక్తిలా కన్పించసాగాడు. అసలు అతన్ని రామనగరంలో చూసిన దగ్గర్నుంచీ తన జీవితమే మారిపోయింది. తన కళ్లనూ, మొహాన్నీ, అందాన్నీ వర్ణిస్తూ అతను రాసిన ప్రేమలేఖలు చదువుతూంటే ఆమె చెప్పలేని ఆనందాన్ని అనుభవిస్తుండేది. అంతకు ముందు తనకు, మనసులో ఆత్మతన్నా, హృదయంలో ఆవేదనన్నా తెలిసేదికాదు. కాని అతని పరిచయంతో, ఒక నూతన చైతన్యం పొంది, అతని కోసం, అతని మాటల కోసం, అతని రాకకోసం ఎదురు చూస్తూ, చలించి పోతూండేది. తను అతనిని అనవసరంగా అనుమానించి, తీరని అపరాధం చేసింది. అందుకు నిష్కృతి, క్షమాపణ వేడుకోవడమేను. కాని ఆ మాత్రం భాగ్యానికి తను నోచుకున్నట్లు లేదు. ఎందుకంటే ప్రసాద్ ఆ వూరు వదలి వెళ్లిపోయాడేమోనని అనుమానంగా ఉంది. అంతేకాక, మరునాడే తన పెళ్లి వారొస్తున్నారు. ఇన్నాళ్లూ తనను కలుసుకోవాలనీ, తనకు సందేశం అందించాలనీ, ప్రసాద్ ఎంతో ప్రయత్నిస్తూంటే, తను ఆ అవకాశం ఉపయోగించుకోలేక పోయింది. కాని ఇప్పుడు తీరా తనకు అతనిని కలుసుకోవాలనిపించగానే, అతను అదృశ్య మవడమే కాకుండా, ఏ మొహంతో అతనిని పలుకరించగలనా? అన్న విచారం కూడా పట్టుకుంది. ఒక వేళ తను, అతను బుచ్చి శాస్త్రి ద్వారా పంపిన సందేశం స్వీకరించ లేదనీ, అతను ఉత్తరం రామారావుగారి గదిలోంచి విసిరినప్పుడు చింపేశాననీ, అతనికి మనసు కష్టం కలిగి తన మీద కోపం వచ్చి ఉండకూడదా ? తను మాట్లాడ దల్చుకున్నా అతను మాట్లాడొద్దూ ? అతను తనను క్షమించకపోతే ఈ జీవితం ఎందుకు ?

ఏమైనా అతనితో కొద్దిసేపు మాట్లాడితే, అతని వద్ద తను క్షమాభిక్ష పొందగలనని ఆమెకు ధైర్యం ఉంది. ఇప్పుడు తను చేయవలసిన పనల్లా, అతనికి విషయాలన్నీ తెలియజేస్తూ ఒక ప్రేమ లేఖ వ్రాయడమేనూ. ఆ లేఖ అతని కంద జేస్తే అతను తనను క్షమిస్తాడు.

రాత్రి చాలాసేపు కూర్చుని, కష్టపడి, ప్రేమలేఖ తయారు చేసింది కమల. అది ప్రసాద్ బుచ్చిశాస్త్రి ద్వారా పంపాలని నిశ్చయించింది.

ప్రొద్దున్నే బుచ్చి శాస్త్రి రాగానే అతనికి ఆ లేఖ రహస్యంగా ఇచ్చింది. ప్రసాద్‌కు ఇమ్మనీ, ఎలాగైనా అతని వద్దనుండి జవాబు తెమ్మనీ చెప్పింది. అంతకన్నా ఎక్కువ మాట్లాడడానికి వీలులేక పోయింది. ఎందుకంటే అవాళ పెళ్లివారు వస్తున్నారు. తగిన ఏర్పాట్లు చేసే విషయంలో బుచ్చి శాస్త్రి తిరుగుతున్నాడు. అందుకని సుబ్బయ్య గారు పిలిస్తే హడావుడిగా వెళ్లిపోయాడు.

(స శేషం)

# కూలిన గోడలు

14వ పేజీ తరువాయి

పట్నంలో చదువు వెలగబెడుతున్నావని జబ్బాలు చరుచుకోవాలేమిట్రా ? సిగరెట్లు దండిగా కాలుస్తున్నట్టున్నావే ? " తన పెద్దరికం నిలుపుకోవాలన్న తాపత్రయం విశ్వనాథంలో తగ్గలేదు.

మధుకి విశ్వనాథం మీద మిగిలివున్న భక్తి కాస్తా హరించి పోయింది. — జేబులోంచి సిగరెట్ పెట్టె తీసి సిగరెట్ నోట్లో పెట్టుకొని టక్కున అగ్గిపుల్ల గీసి వెలిగించాడు — " పరిస్థితులకు తగ్గట్టుగా మారిపోక తప్పదు మామయ్యా ! ఏం చేస్తాం ? " వుంగరాలు వుంగరాలుగా తమాషాగా పొగ వదిలాడు—

" ఏదో గొప్పతనం అని అఘోరిస్తున్నావ్."

విశ్వనాథం వెటకారంగా అనేసి మాడ్చుకున్న మొహంతో వీధి గుమ్మం కేసి నడిచాడు.

" అలా తోటలోకి పోదాం రారా బావా ! " వాతావరణాన్ని కాస్త వుల్లాసం చేస్తూ లేచాడు. కృష్ణుడు.

" రాత్రికి యిక్కడే భోజనం చేద్దువుగాని అబ్బాయ్. ఇంటికి వెళ్లకు. " — సావిత్రి ప్రాధేయ పడుతున్నట్లు అంది.

" లేదులే అత్తా ! ఇంటికి వెళ్లాలి. మా వదినకి వస్తానే చెప్పాను."

మధు కృష్ణుడూ కలిసి తోటలోకి వెళ్లేసరికి గున్న మామిడి చెట్టు క్రింద సుధ ఏదో కథల పత్రిక చదువుకొంటూ కన్పించింది. — తెలుపు పరికిణీ మీద గులాబీ వాయిల్ వోణి వేసుకొంది. రెండు జడలూ సగం సగం వరకూ ఎర్రటిబిల్కు రిబ్బను కుచ్చులు బుజాల మీద పడుతోంటే పుస్తకం ఒడిలో పెట్టుకొని పేజీలు తిరగేస్తూ కూర్చుంది.

" సుధా ! బావ వచ్చాడే ! "

త్రుళ్లిపడ్డ సుధ దిగ్గున తల ఎత్తటంలో కుడి చెంపలోని తెల్ల గులాబీ బుజం మీదికి జారి పోయింది. — అనుకోకుండా మధుని కళ్లారా చూసిన సుధ మొహంలోకి కలవరపాటు మధుకి అర్థమై పోయింది. సుధ నుదుటి మీద దోసగింజ లాంటి బొట్టు తదేకంగా చూడాలని అనిపించింది. — సుధ చిన్నతనాని కన్నా బాగా తెల్ల బడింది. — మధుకి అప్రయత్నంగా శ్యామసుందరీ దేవి జ్ఞప్తికి వచ్చింది. ఆవిడ తర్వాత అంత అందమైనమైనది — వాజూకైనదీ సుధ ఒక్కటే. — ఈ ఈ తెల్లదనం ఆవిడ తెల్లదనమే.

" ఏమిట్రా అలా నిలబడి పోయావ్ ? కూర్చో". కృష్ణుడు సుధ పక్కన కూర్చుని మధు చెయ్యి పట్టుకు లాగి కూర్చోబెట్టాడు. ఇద్దరిమధ్యా ఇరుక్కున్న సుధ మొహం ముడుచుకొని రుసరుసలాడుతూ లేచిబోయింది—

" ఎందుకే నీకంత చిరాకు ? కూర్చో. కృష్ణుడు చెయ్యి పట్టుకుని వారించాడు — " మధు కొత్త వాడేమిటి ? చిన్నప్పుడు అందరం దెబ్బలాడుకునే వాళ్లం కాదూ ? "

" అవును. నేను మీ చెల్లాయి గారికి బోల్డు సార్లు వీపుమీద విందు చేశాను." మధు నవ్వుతోంటే సుధ మొహం చిటపటలాడించింది —

మీ పాత మిత్రుల్ని తీసుకొచ్చాం. వీరెవరో మీకు జ్ఞాపకముందా ?'' అని తనతో వచ్చిన స్త్రీని, పురుష వ్యక్తినీ చూపించింది.

సుబ్బయ్యగారు ఒక్క నిముషం ఆమె వైపు చూసి, ''ఆ !'' అని ''ఎన్నాళ్లకు ! ఎన్నాళ్లకు ! చూసుకున్నామమ్మా !'' అని కంటి నీరుతో, గద్గద కంఠంతో, ''అయితే నా స్నేహితుడు నన్ను వదిలి వెళ్లిపోయాడా ?'' అని కండ్ల వెంట నీరు కార్చ సాగారు. కొద్ది నిముషాలాగి, ''ఎన్నాళ్లయింది ?'' అని అడిగారు.

జగదాంబగారు, ''పదేళ్లయింది. అదిగో అతను ఆమె పెద్ద కొడుకు. వీరికీ, మాకూ కలకత్తాలో బాగా పరిచయం. మొన్న నేను మద్రాసు నుంచి బెజవాడ వచ్చి వీరింట్లోనే దిగాను. అక్కడ మీ ప్రస్తావన వచ్చి, 'చాలా కాలమైంది వారి కుటుంబాన్ని చూసి' అన్నారు. వెంటనే ఒకసారి చూడాలని నిశ్చయించి బయల్దేరాం.'' అంది.

సుబ్బయ్యగారు, ''చాలా సంతోషమమ్మా కరుణాకరంగారి గురించి ఎన్నాళ్లో నేను కొట్టుకు పోయాను. కాని ఆయన సంగతి నాకెవరూ చెప్పలేదు. మీకూ వారికీ పరిచయం ఉందనే విషయమే తెలియదు.'' అని వారందరినీ ఇంట్లోకి తీసుక వెళ్లారు. తన భార్య వద్దకు వెళ్లి, ''నీకోసం, మీనాక్షమ్మగారు వచ్చారు.'' అన్నారు ఆమె మంచ మీదున్న మనిషి మెల్లిగా లేవబోయింది. మీనాక్షమ్మ గారు, ''వదినా ఎన్నాళ్లయింది నిన్ను చూసి,'' అని ఆమెను కౌగిలించుకుంది. కొద్దిసేపు వారిద్దరూ మాట్లాడుకున్నాక, సుబ్బయ్యగారి భార్య కూతుళ్లని పిలిచి ''మీరు పుట్టక ముందు నేమిద్దరం స్నేహితురాళ్లం. ఈమె భర్తే కరుణాకరం గారు, మీ నాన్నగారికెంతో సాయం చేశారు.'' అని చెప్పి కమలనీ, విమలనీ, రవికుమార్‌నీ పరిచయం చేసింది.

''అప్పుడు మీకొక అబ్బాయి ఉండేవాడు''

''అవును వాడే నాతో ఇప్పుడు వచ్చాడు. సుధాకర్ ! డాక్టర్ పరీక్ష పాసయి బెజవాడలో ప్రాక్టీసు చేస్తున్నాడు. రెండో వాడు, ఇరవై రెండేళ్లవాడు బి. ఏ. పాసయ్యాడు.

''రెండో అబ్బాయిని తీసుకు రాలేదా ?'' అంది సుబ్బయ్యగారి భార్య.

''లేదమ్మా. వాడు వట్టి ఆకతాయి మనిషి వాళ్లన్నయ్య, నేమా, ఏదో కేకలేశామని, మామీద అలిగి రెండు నెలల క్రితం ఇంట్లోంచి పారిపోయాడు. అప్పటి నుండి ఎంత ప్రయత్నించినా ఎక్కడా కన్పించలేదు. మొన్న జగదాంబగారు వచ్చి, వాడీ వూళ్లోనే ఉన్నాడని చెప్పారు.''

''ఈ ఊళ్లోనా ?'' అన్నారు కమలా, విమలా, వాళ్లమ్మా ఒక్కసారి.

జగదాంబగారు, ''అవును ఈ వూళ్లోనే. అవాళ మీరు నా కోసం స్టేషనుకు వచ్చినప్పుడు చూశాను. అతనే రైలు వెళ్లి పోతూంటే, పరిగెత్తి వెళ్లి ఆపి నాకు చాలా సాయం చేశాడు. క్రిందటి సారి చూసినప్పటికన్నా బాగా ఎదిగాడు అందువల్ల ముందు గుర్తించలేక పోయాను కాని తరువాత గుర్తించాను.''

కమలా, విమలా ఒక్కసారిగా. ''అయనా !'' అని ఒకరి మొహం ఒకరు చూసుకోనారంభించారు.

''ఏం ? వాడు మీకు తెలుసా ?'' అంది మీనాక్షమ్మ తత్తరగా.

విమల ఏదో అనబోయి ఆగి, చెల్లెలి వంక చూసింది. కమల ఏదో అందామని, అక్కవైపు చూసి ఆగింది. ఇద్దరూ ఆమె వైపు చూసి, ''అబ్బే ! ఏం లేదు !'' అన్నారు.

ఇద్దరి మొహాలలోనూ చాలా మార్పు రావడం జగదాంబగారు గమనించింది. అప్పటికి ఏమీ అనకుండా, ''అతను ఎక్కడ ఉంటాడో తెలుస్తే బాగుండును.'' అని వూరుకుంది. తక్కిన వారు కనుక్కుంటా మన్నారు.

వచ్చిన వారు స్నానపానాలు అవీ చేశాక, విశ్రాంతి తీసుకో నారంభించారు. అప్పటి కప్పుడే సుధాకర్ ఒకసారి వూరంతా తిరిగి వచ్చి, తమ్ముడు ఎక్కడా కన్పించలేదని చెప్పాడు ! తల్లితో. సుబ్బయ్య గారితో భోజనాల వద్ద ఈ విషయం చెప్తే, తను కూడా వాకబు చేస్తానన్నారు. కాని ఆయనికి కరుణాకరంగారి అబ్బాయే, కమలను ప్రేమించిన యువకుడనే విషయం తెలియలేదు. ఎందుకంటే స్టేషనులో జరిగిన సంఘటన ఆయన కెవరూ చెప్పలేదు. అందువలన ఆ కుర్రాడింకెవరో అనుకున్నారు. అసలింత వరకూ ఆయన ప్రసాద్‌ని ప్రత్యక్షంగా ఎరుగరు.

భోజనాలయ్యాక మేడమీద గదిలో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, జగదాంబగారు మెల్లిగా విమల నొక్కర్తినీ తన వద్ద కూచో పెట్టుకుని ప్రసాద్ విషయం మళ్లీ అడిగింది. విమల, ప్రసాద్ కమలా ఒకరి నొకరు ప్రేమించుకున్నారనీ, కానీ ప్రసాద్ ఎవరో తెలియక పోవడం వల్లసుబ్బయ్య గారు, అందుకెంత మాత్రం అంగీకరించక, కమలకు వేరే ఒక గొప్పసంబంధం నిర్ణయించారనీ, పెళ్లి వారు ఆ మర్నాడే వస్తున్నారనీ, చెప్పేసింది. సాయంకాల మయ్యేసరికి మీనాక్షమ్మ గారికి, జగదాంబగారి ద్వారా తెలిసింది. ఆమె ''అయ్యో ! ఎంత పని జరిగింది ! కమల మా కోడలైతే ఎంత బాగుండును !'' అనుకుంది.

ప్రసాద్, ఆ వూరల్లా వెదికినా కన్పించక పోయేసరికి, సుధాకర్, నిరాశ జెంది, అసలు ప్రసాద్ ఆ వూరు వదలి వెళ్లిపోయేడేమోనని అనుమానించాడు. ఆ రోజు రామారావుగారు కూడా వూళ్లో లేరు. అందువల్ల విమల, రామారావుగారికి ప్రసాద్ విషయం తెలుసుననీ ఆయన వూరు నుంచి రాగానే ఆయనను కనుక్కోవచ్చునంది. ఆ రాత్రి అందరూ కలత మనసులతో నిద్రించారు. కమలకు అసలు నిద్ర పట్టలేదు.

ఆమె దృష్టిలో, ప్రసాద్ గురించి ఉన్న అపోహలు మీనాక్షి గారి రాకతో తొలగి పోగానే, అతను చాలా గొప్పవ్యక్తిలా కన్పించసాగాడు. అసలు అతన్ని రామనగరంలో చూసిన దగ్గర్నుంచి తన జీవితమే మారిపోయింది. తన కళ్లనూ, మొహాన్నీ, అందాన్నీ వర్ణిస్తూ అతను రాసిన ప్రేమలేఖలు చదువుతూంటే ఆమె చెప్పలేని ఆనందాన్ని అనుభవిస్తూండేది. అంతకు ముందు తనకు, మనసులో ఆత్మ తన్నా, హృదయంలో ఆవేదనన్నా తెలిసేదికాదు. కాని అతని పరిచయంతో, ఒక నూతన చైతన్యం పొంది, అతని కోసం, అతని మాటల కోసం, అతని రాకకోసం ఎదురు చూస్తూ, చలించి పోతూండేది. తను అతనిని అనవసరంగా అనుమానించి, తీరని అపరాధం చేసింది. అందుకు నిష్కృతి, క్షమాపణ వేడుకోవడమేను. కాని ఆ మాత్రం భాగ్యానికి తను నోచుకున్నట్లు లేదు. ఎందుకంటే ప్రసాద్ ఆ వూరు వదలి వెళ్లిపోయాడేమోనని అనుమానంగా ఉంది. అంతేకాక, మరునాడే తన పెళ్లి వారొస్తున్నారు. ఇన్నాళ్ళూ తనను కలుసుకోవాలనీ, తనకు సందేశం అందించాలనీ, ప్రసాద్ ఎంతో ప్రయత్నిస్తూంటే, తను ఆ అవకాశం ఉపయోగించుకోలేక పోయింది. కాని ఇప్పుడు తీరా తనకు అతనిని కలుసుకోవాలనిపించగానే, అతను అదృశ్య మవడమే కాకుండా, ఏ మొహంతో అతనిని పలుకరించగలదా? అన్న విచారం కూడా పట్టుకుంది. ఒక వేళ తను, అతను బుచ్చి శాస్త్రి ద్వారా పంపిన సందేశం స్వీకరించ లేదనీ, అతను ఉత్తరం రామారావుగారి గదిలోంచి విసిరినప్పుడు చింపేశాననీ, అతనికి మనసు కష్టం కలిగి తన మీద కోపం వచ్చి ఉండ కూడదా ? తను మాట్లాడ దల్చుకున్నా అతను మాట్లాడొద్దూ ? అతను తనను క్షమించకపోతే ఈ జీవితం ఎందుకు ?

ఏమైనా అతనితో కొద్దిసేపు మాట్లాడితే, అతని వద్ద తను క్షమాభిక్ష పొందగలనని ఆమెకు ధైర్యం ఉంది. ఇప్పుడు తను చేయవలసిన పనల్లా, అతనికి విషయాలన్నీ తెలియజేస్తూ ఒక ప్రేమ లేఖ వ్రాయడమేనూ. ఆ లేఖ అతని కంద జేస్తే అతను తనను క్షమిస్తాడు.

రాత్రి చాలాసేపు కూర్చుని, కష్టపడి, ప్రేమలేఖ తయారు చేసింది కమల. అది ప్రసాద్ బుచ్చిశాస్త్రి ద్వారా పంపాలని నిశ్చయించింది.

ప్రొద్దున్నే బుచ్చి శాస్త్రి రాగానే అతనికి ఆ లేఖ రహస్యంగా ఇచ్చింది. ప్రసాద్‌కు ఇమ్మనీ, ఎలాగైనా అతని వద్దనుండి జవాబు తెమ్మనీ చెప్పింది. అంతకన్నా ఎక్కువ మాట్లాడడానికి వీలులేక పోయింది. ఎందుకంటే అవాళ పెళ్లివారు వస్తున్నారు. తగిన ఏర్పాట్లు చేసే విషయంలో బుచ్చి శాస్త్రి తిరుగుతున్నాడు. అందుకని సుబ్బయ్య గారు పిలిస్తే హడావుడిగా వెళ్లిపోయాడు.

**(సశేషం)**

---

ఒక పెద్దమనిషి : మీ ఇంట్లో పిల్లలంతా పరీక్ష పాసైనారా అండీ !

రెండో పె. మ. మా యింట్లో పదిమంది స్కూల్లో చదువుతున్నారు. అందులో నలుగురు మాత్రమే పాసైనారండి !

మొదటి పె.మ. ఫరవాలేదండీ మీకు పాస్ మార్కు వచ్చింది గదండీ !

ఎం. రాంమోహన్‌రావ్ (తెనాలి)

---

## నేతలో, మన్నికలో పనితనంలో

# కొఠారీ మల్లులు

## విశిష్ఠమైనవి లాంగ్‌క్లాత్‌లు కూడా!

...ఎందుకంటే

- కొఠారీ మల్లులు మరియు లాంగ్‌క్లాత్ బట్టల తయారీలో ఉపయోగింపబడిన నూలు ఉత్తమ రకపు కొఠారీ నూలు.
- వాటంతటవే తిరిగే ఆటోమాటిక్ లూములమీద నేసిన బట్ట నేత బాగా ఉంటుంది.

ఎప్పుడూ కొఠారీ మల్లు M-7 మరియు అదే పేరుతో లాంగ్‌క్లాత్ L-1 లేక L-2 అడగండి.




ఈ ట్రేడ్ మార్కుని గమనించండి




తయారుచేసినవారు:
కొఠారీ టెక్స్టైల్స్ లిమిటెడ్
పింగనల్లూరు, కోయంబత్తూరు.
భారతీయ మానక్ సంస్థ సర్టిఫయింగ్ మెంబర్లు.
మేనేజింగ్ ఏజెంట్లు:
కొఠారీ & సన్స్, ఓరియంటల్ బిల్డింగ్స్, అర్మీనియన్ స్ట్రీటు, మద్రాసు-1.

ASP/GM/23 TEL

పళ్లు రావటమా?
వాతమా?
కడుపు నొప్పా?



# మేనర్స్
## గ్రైప్ మిక్శ్చర్

యివ్వండి
చిరునవ్వుల
చిందులాట చూడండి






**ఇప్పుడు**
ఉల్లాసకరమైన
ఎరుపు నీలిరంగుల్లో
ప్యాకింగ్

ఆధునిక తల్లులు తమ పిల్లలకు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ యిస్తారు. నోటికి యింపైన రుచి పరిశుద్ధముగా ప్యాక్ చేయబడినది.

అదృష్టపాపలు పొందుతారు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్

GEOFFREY MANNERS & COMPANY LIMITED

# కూలిన గోడలు

" పిగ్గు లేకపోతే సరి."

" ఎందుకూ ? నీ దగ్గిర కూర్చోటానికా ? "

" ఒరేయ్ మధూ ! ఊరుకో — ఈసారి నుంచీ నువ్వే వాడికి విందు చేద్దువుగానిలే సుధా ! ఎందుకంత కోపం ? "

" మీ చెల్లాయి కూర్చున్నచోట ముళ్లు వున్నట్టున్నాయిరా కిష్టిగా. కాస్త చూసుకోమను.'

" నువ్వేం చెప్పక్కర్లేదు పోదూ ! "

" అబ్బ ! దెబ్బలాడుకోకండర్రా ! కాస్సేపు మాట్లాడుకుందాం."

" ఏమిటి మాట్లాడుకునేది ? ప్రయివేటు మాష్టారొస్తారు. నేను పోవాలి."

" ప్రయివేటు కూడానా ? స్కూల్లో చదువు చాలటం లేదూ ? " మధు వెక్కిరింపుగా అన్నాడు.

" బావుంది. అంతా నీలా తెలివైన వాళ్లే వుంటారా ? "

" తెలివి లేకుండానే డాక్టర్ అవుతావా ? "

" డాక్టర్ నవుతానని నీకు నేనేం చెప్పలేదని."

" మీ వాళ్లు చెప్పార్లే. నావుద్దేశ్యం కూడా అడిగారు."

" నా చదువుకి నీవుద్దేశ్యం దేనికి ? "

" దేనికో వెళ్లి మీవాళ్ల నడుగు."

సుధ మాటలు దొరకనట్టు ఆగిపోయింది.

" బావుంది లెండి. మీరిద్దరూ దెబ్బలాడుకునేలా వున్నరు. సర్దాగా కబుర్లు చెప్పుకుందామంటే ఏమిటిది ? " కష్ణుడు విసుక్కున్నాడు.

సుధ నిర్లక్ష్యం మధుకి బాగా అర్థమైంది —

" మాష్టారు వస్తారటుగా ? వెళ్లనీ ! "

" అరుచుకుని అరుచుకుని పోతాల్లేద్దూ ! ఈ పూట మా అమ్మే పంపించేస్తుందిలే."

" అదేం కాదు. నేను పోతాను. ఇవ్వాళ ఇంగ్లీషు పద్యాలు అప్పగించాలి." సుధ విసురుగా లేచి నీల

బడింది — ఎవ్వరూ వారించక పోవటంతో అడుగులో అడుగు వేసుకొంటూ వెళ్లి పోయింది. కన్పించే వరకూ చూసి మధు తలపంకించాడు.

" పెద్ద మామయ్య లక్షణాలే వచ్చినట్టు న్నాయ్."

" మా పెదనాన్నకి సుధంటే భలే ఇష్టంలేరా ! దాన్ని డాక్టర్ చదివించేస్తానని ఎవ్వరూ దానిముందు పనికి రారనీ కబుర్లు చెప్తూ వుంటాడు ?"

" ఊఁ. ఇంకా ఇంట్లో సంగతులేమిట్రా."

" మామూలే. నీమీద మాత్రం ఎవ్వరికీ కోపంలేదు."

మధు ఇంటికి తిరిగి వెళ్లాక సూర్యంతో అన్నాడు.

" వాళ్ల ప్రవర్తన చిత్రంగా వుందన్నయ్యా ! ఎంత మర్యాదా ! ఎంత ఆప్యాయతా ! ఏం చెప్పను ?"

" నిన్ను మంచి చేసుకోవాలనే వాళ్ల తాప త్రయం." నవ్వుతూ అంది ఇందిర.

" చాల్లేవూరుకో — " సూర్యం కోపంగా అన్నడు.

" వాడు నిజమే అనుకుంటాడు — కాలం ఎప్పుడూ ఒక్కలాగే వుండి పోతుందా ? " సమర్థించాడు సూర్యం.

" పెద్ద మామయ్య మాత్రం ఎప్పటిలాగే వున్నాడనిపించింది."

" పోనిద్దూ ! ఎంతైనా పెద్దవాడు."

మధు తర్వాత ఇందిరతో చెప్పాడు — " సుధకి మాత్రం మహా గీరగా వుంది వదినా ! దాని స్టైలు అవీ చూస్తుంటె డాక్టర్ కాదు గానీ ... యాక్టర్ అయ్యేలా వుంది."

ఇందిర నవ్వింది — " చిన్నతనం. పెద్దవాళ్లలా నేర్పిపెడుతోంటే ఆ పిల్లేం చేస్తుంది ? రేపు నీ పెత్తనం వచ్చాక చెవులు మెలి పెడుదువుగానిలే."

మధు కూడా నవ్వేశాడు.

* * *

వేసంగి సెలవులు వుల్లాసంగా గడిచి పోయాయి. మధు జానకి పిన్ని దగ్గరికి వెళ్లాడు, వెంక ట్రావు బాబాయ్ జానకిపిన్ని అన్యోన్యంగా బ్రతుకు తున్నారు. పిన్ని కొడుకు బళ్లో చేరి అ ఆ లు కూడా దిద్దుతున్నాడు మణిల అప్పుడప్పుడూ వచ్చి ఎక్కు వగా పిన్ని దగ్గిరే వుండి వెళ్తుంది.

మధు మణిలను చూసేందుకు సంస్థానానికి కూడా వెళ్లాడు. సెలవులకు వచ్చినప్పుడల్లా శ్యామ సుందరీదేవి దర్శనం చేసుకొని మరీ వెళ్లటం పరిపాటే. పద్మావతి వివాహమై అత్తవారింటికి వెళ్లి పోయింది. రాగిణి బస్తీలో చదువు కుంటోంది— పెద్ద చదువు చదువు కుంటూన్న రాగిణిలో నవ నాగరికత తాలూకు లక్షణాలేమీ లేవు — చిలిపి తనం మాత్రం చిన్నప్పటిలాగే వుంది.

" మధుబాబూ ! మనం చిన్నప్పుడు భలే ఆడుకునే వాళ్లం కదూ? బొంగరాల ఆట జ్ఞాపకం వస్తే నాకు మరీ నవ్వు వస్తుంది. ఇప్పుడు మళ్లా మనం చిన్న పిల్లలమై పోయి తోటలో పరుగు లెత్తితే ఎంత బావుంటుందీ ! " అంటుంది ప్రతిసారి.

" నిజమే రాగిణి ! అది సాధ్యమైతే ఎంతైనా బావుంటుంది." అంటాడు మధు.

శ్యామసుందరీదేవి నవ్వి ఆ ఇద్దరి ఆశలూ తోసి వేస్తుంది. — " మీరు మళ్లా చిన్నపిల్లలవటం సాధ్యమే అయితే అది కావాలని మీరు కోరనే కోరరు. కోరుకున్నప్పుడల్లా చిన్నపిల్లలై ఆడుకో గలిగితే అందులో మాధుర్యమేది? ఈ జ్ఞాపకాలిలా నిలుస్తాయి ? ఆ సంతోషాన్నిన్నిసార్లు నెమరు వేసుకోవట మెందుకు? "

(సశేషం)

# జన్మదినఫలం

27 వ పేజీ తరువాయి

వ్యాపారం ప్రోత్సాహకరంగా ఉంటుంది. అనుకున ట్టుగా అన్ని పనులూ నెరవేరుతాయి గాని ప్రతిఫలం మాత్రం మీ అంచనాకు తక్కువగానే ఉంటుంది. వృత్తిలో ఇదివరకు ఏర్పడిన చిక్కులు తొలగి పోతాయి. ఉద్యోగంలో మీకు అనుకూలంగా చిన్నచిన్న మార్పులు రావచ్చును. ఆరోగ్యం సంతృప్తి కరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సిథాటం కంగా కొనసాగుతాయి. విలాసయాత్రలు చేస్తారు. ఇష్టంలేక పోయినా అనవసర వ్యయం జరుగు తుంది. విద్యార్థులకు పరీక్షా ఫలితాలు సంతృప్తి కరంగా ఉండవు.

## ఆగష్టు-11

ఆయాసం ఎక్కువ అనుభవం తక్కువ అనే పరిస్థితి ఈ సంవత్సరం ఏర్పడవచ్చును. అన్ని వ్యవహారాల్లోను పలుకుబడి పెరుగుతుంది. మీ ఆలో చనలు మీ స్వంత వ్యవహారాల్లో కంటె ఇతరులకు సహాయపడంలో బాగా తోడ్పడతాయి. వ్యాపారం సామాన్యంగా ఉంటుంది. భారీ ఎత్తున చేసే వ్యాపా రాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. ప్రతి వ్యవహారంలోను మీరు వూహించిన దానికంటె ఎక్కువ వ్యయం జరగడంవలన ఆదాయం పెరగ డానికి అవకాశం లేదు. వృత్తి ఉద్యోగాల్లో ఆర్థి కంగా ప్రయోజనం ఉండకపోయినా మీ ప్రవ ర్తన సమాజంలో గౌరవాన్ని ఇనుమడింపజేస్తుంది. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పించవచ్చును. కుటుంబ వ్యవహారాలు మామూ లుగా జరిగిపోతాయి. రాజకీయ వ్యవహారాల్లో నూతన గౌరవం లభిస్తుంది. విద్యార్థులు సామా న్యంగా కృతార్థులు కాగలరు.

## ఆగష్టు-12

ఈ సంవత్సరం మొత్తంమీద బాగా ఉంటుంది. సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉంటుంది గాని, రానురాను అన్ని వ్యవహారాల్లోను అనుకూ లత లభిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నం లేకుండానే కొన్ని మార్పులు రావచ్చును. వాటివల్ల మున్ముందు చాలా ప్రయోజనం ఉంటుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంవత్సరాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో పోటీ కొంత తగ్గి ఆదాయం పెరుగు తుంది. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం సంతోషం లభిస్తాయి. కుటుంబ వ్యవహారాలు అంత బాగా ఉండవు. విద్యార్థులు ఏప్రిల్ పరీక్ష లలో మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## ఆగష్టు-13

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటిగా ఉంటుంది. గాని, జరిగినది కూడా మీకు వ్యతిరేకమైనది కాకపోవడంవల్ల కొంత సంతృప్తిని కలిగిస్తుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు కొంచెం అనుకూలంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో పెద్ద మార్పులు రావు గాని స్వల్పంగా ఆదాయం పెరగవచ్చును. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలత ఏర్పడుతుంది. వ్యాపా రంతో ఆకస్మికంగా పెట్టుబడి చాలని లోటు కన్పించవచ్చును. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. ఇంతవరకు చికాకులతో ఉన్న బంధు వ్యవహారాలకు పరిష్కారమార్గం లభి స్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. విద్యార్థులు శ్రమమీద కృతార్థు లు కాగలరు.

★

BI-TFN-7 TEL



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే టీ

సాటిలేని టీ!



టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** టీ త్రాగండి; ఆనందము అందుకోండి!

ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్—నారింజ రంగు ప్యాకెట్
షాన్—నీలి రంగు ప్యాకెట్



# కార్యసిద్ధి

ముద్దా శాస్త్రిబాబు

(గతసంచిక తరువాయి)

ఆ రోజు —

కాశీరాజు కొడుక్కి యౌవ రాజ్యాభిషేకమూ కళ్యాణ మహోత్సవమూ జరగాల్సిన శుభ దినం. రాజ్యమంతా ఎక్కడ చూచినా పచ్చటి తోరణాలతో, రకరకాల అలంకారాలతో కలకళ్లాడుతూ వుంది. సమస్తమయిన ఏర్పాట్లూ అత్యంత కోలాహలంగా వున్నాయి. ఇంతా చేసి, అసలు తతంగం నడిపించ వలసిన మహోదధి ఇంకా రాలేదేమా అని, అంతా ఆత్రంతో ఎదురు చూస్తున్నారు ! —

ఇటువంటి సమయంలో —

కోట సింహద్వారం దగ్గర ఏదో గొప్ప అలజడి బయల్దేరింది ! — ఏమిటో చూద్దామని నగరంలో జనమంతా వచ్చి మూగేశారు. ఈ సంగతి తెలిసిన క్షణమందే రాజు అంతఃపురం నుంచి దిగి వచ్చాడు ! — చూడగా ఆ సింహద్వారం దగ్గర జరిగిన సంఘటనకు అందరూ విస్మయం పొందారు ! — వాళ్లకే కాదు, ఆ సంఘటన ఎవళ్లకైనా ఆశ్చర్యం కలిగిస్తుంది.

అది ఏమిటంటే —

అందరూ ఇంతగా ఎదురు తెన్నులు చూస్తూ వున్న పురోహితుడు — మహోదధి ఎప్పుడో వచ్చేశాడు. వచ్చి, కోట సింహద్వారం దగ్గర పడివున్న ఒక నల్లరాతి వైపు అదే పనిగా పరకాయించి చూస్తున్నాడు ! — ఆయన ఎందుకలా చూస్తున్నాడో ఒక్కళ్లకూ అర్థం కాలే. అర్థం కాకుండానే వాళ్లూ అలా రాతిని చూస్తూ నించున్నారు.

అప్పుడు మహారాజు ద్వారం వద్దకు వచ్చి, "స్వామీ ! — మనకు ముహూర్తం వేళ కావచ్చిందే ? — దయ చేయండి లోపలికి. ఇక్కడేదైనా పని వుంటే తరువాత చూసుకుందాం ! — " అంటూ మహోదధిని తొందర పెట్టసాగాడు.

అందుకు మహోదధి నవ్వుతూ, "రాజా ! — మన ముహూర్తం కంటె ముందుగా జరగవలసిన తతంగం వేరే వుంది. ఇటువంటి శుభకార్యాలు తలపెట్టినప్పుడు మనకు ఆటంకం కలిగించటానికని కొన్ని కొన్ని దుష్టగ్రహాలు మూల మూలల నక్కి వుంటాయి. వాటి సంగతి ముందు చూసిన తరవాతనే మన కార్యం ప్రారంభించాలి. ఇప్పుడిక్కడ అటువంటిదే ఏదో గ్రహం నక్కి వున్నట్టు నాకు తోస్తుంది. ఎందుకేనా మంచిది, ఆ దుష్టగ్రహానికి తగిన శాంతి చేసి సాగనంపేస్తే, మన పని మనం నిశ్చింతగా నిర్విఘ్నంగా చూసుకోవచ్చు. ఇందుకు గాను ముందుగా మన మందరం కలసి కలిసి వూపిరాడకుండా టెంకాయలు అభిషేకం చెయ్యాలి. ఈ గ్రహాలకు టెంకాయలు ఎంతో ఇష్టం ! — " అని చెప్పాడు.

మహోదధి నోటి వెంట ఈమాట రావడమే తడవు, వరసన బళ్ల మీద కొబ్బరికాయలు కోకొల్లలుగా వచ్చి, మేటలు మేటలుగా పడ్డాయి !—

వెంటనే మహోదధి, "మహారాజా ! — తలవని తలంపుగా ఎన్నెన్నో పనులు జరుగుతూ వుంటాయి. ఇదిగో — ఇప్పుడు మన పనికి సదుపాయంగా చక్కటి నల్లరాయి దొరికింది. ఎంత అందంగా వుందో ఈ రాయి ! — ఇక — విఘ్నాలకు రాజయిన వినాయకుడ్ని మనసులో తలచుకుని, ఈ రాతి మీద కొబ్బరికాయలు కొట్టాలి. రాజా — ముందు మీరు స్వయంగా ఈ కాయే కొట్టండి! — " అని చెప్పి ఒక కాయ రాజుచేతికిచ్చాడు. రాజు ఆ కాయను రాతి మీద వేసి కొట్టాడు.

తరువాత అక్కడ మూగిన లక్షలాది ప్రజలూ తలా ఒక కాయ కొట్టవలసిందని మహోదధి చెప్పాడు. అప్పుడు వాళ్లందరూ ఎంతో ఉత్సాహంతో పోటీలు పడి టెంకాయలన్నీ రాతి మీద వేసి తెరపి లేకుండా కొట్ట సాగారు ! —

అలా వాళ్లు కాయలు కొడుతూ వుంటే ఆనల్లరాయి ప్రాణం వచ్చినట్లు విచిత్రంగా కదిలింది. జనం భయ పడ్డారు. ఎడంగా తప్పుకో బోయారు.

అప్పుడు మహోదధి ముందుకు వచ్చి నిలబడ్డాడు :

"మీరేం భయపడకండి. ఇది నిజమయిన రాయి అనుకున్నారేమో ! — కాదు కాదు. అయినా రాయెక్కడయినా దానంతటది ఇలా కదులుతుందా ? — మీరే చెప్పండి. ముందు మిగిలిన ఆ కాయలన్నీ కొట్టేసెయ్యండి. ఈ రాతిలో వుండే ఇంద్రజాలం ఏమిటో మీకు చూపిస్తా. ఊఁ — కానియ్యండి ! — " అంటూ మహోదధి వాళ్లని ప్రోత్సహించాడు.

అందరూ కలిసి ఉత్సాహంతో మిగిలిన కాయలన్నీ కొడుతూ వుంటే, వాళ్ల కళ్ల యెదుటే ఆ నల్ల రాయి ఫెళ్ల మంటూ బద్దలయింది. దానిలోనించి భయంకర మయిన ఒక భీకరాకారం బయటికి వచ్చి, "గణా ! గణా !! — " అని బొబ్బ లెడుతూ, నేలని కూలింది ! —

అప్పుడు మహోదధి ఆ అశేష జనానికి ఇలా చెప్పాడు :

"చూశారా ! — మన శుభకార్యానికి విఘ్నం కలిగించటానికి గాను రాక్షసులు చేసిన మాయ ఇది. ఈ నల్లరాతి రూపంలో ఇక్కడ వెలిసినవాడు గూఢుడనే రాక్షసుడు. రాజ భవనంలో శుభకార్యాలు కనుక, మంచి మంచి వాళ్లు బలవంతులు ఎంతోమంది దొరుకుతారు కదా, కబళించ వచ్చునని వచ్చి ఇక్కడ పొంచి వున్నాడు. కాని మీరంతా కలిసి వాడికి తగిన శాస్తి చెయ్యడంతో వాడు వేసుకున్న పథకమంతా తారుమారై తలకిందులయింది..."

అని అంటూవుండగా, ఆ రాక్షసుడి కళేబరం నుంచి ఒక జ్యోతి వెలువడి మహోదధి హృదయంలో ఐక్యమై పోయింది !! —

ఈ దృశ్యం చూడగానే మహారాజూ, ఆయన ప్రజలూ మహోదధి సాక్షాత్తు ఆ వినాయకుడి అవతారమే అని గుర్తించారు. ఆ మహానుభావుణ్ణి అందరూ కలిసి ఇలా కీర్తించారు :

"గళద్దాన గండం
మిళ ద్భృంగ షండం
చలచ్చారు శుండం
గజత్రాణ శౌండం !
లసద్దంత కాండం
విపద్భంగ చండం
శివప్రేమ పిండం
భజే వక్ర తుండం!"

ఇంకిప్పుడు కాశీ రాజ్యంలో శుభకార్యాలు నిర్విఘ్నంగా జరిగాయి. నాటి నుండీ మహోదధి పేరు చెబితే మన రాక్షసకులానికే హడలు పట్టుకుంది !

ఈ కథ చెప్పి శుక్రాచార్యుడు —

"రాజా ! — చూశావా, తనను నమ్మిన భక్తుల్ని వినాయకుడు ఏ విధంగా కాపాడుతాడో ? ఒకానొకప్పుడు మహోదధిగా అవతరించిన ఆ గణేశుడే నిన్నింతగా కలవర పెడుతున్నాడు," అంటూ ఆ నాటికి కథ ముగించాడు.

## 11

శుక్రాచార్యుడు చెబుతున్నాడు —

సింధురాజు వింటున్నాడు.

మీది మీదికి వస్తున్నాడు ఆ కోయ యువకుడు — 'వల్లీ ! — నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నన్ను పెళ్లాడతావా, లేదా ? ' అని గద్దించి అడుగుతున్నాడు.

ఒళ్లు కంపించింది వల్లికి. గుండె దడదడలాడింది. పెదవులు వణికాయి. 'అ...య్యో...వ్ !..' అంటూ అప్రయత్నంగా ఒక్క పొలికేక పెట్టింది.

వల్లి తండ్రి నంబిరాజు. పరుగులు మీద పరివారంతో సహా బిలబిలమంటూ వచ్చేశాడు.

'అమ్మా! ఏమిటి? ఏం జరిగింది? నిన్నెవరేమన్నారు?—' అని, ప్రశ్నలు కురిపించాడు, తండ్రి.

నోటితో జవాబు చెప్పలేక పోయింది వల్లి. కాని, కోయ యువకుడు కంటబడిన జాగా నుట్టుకు కుడిచేత్తో వేలెట్టి చూపించింది. చూపించిందే గాని గాని, యేముంది అక్కడ ? ఇంకెక్కడున్నాడు — ఆ యువకుడు ? — అయితే, అతడు లేడు గాని, అతడు నిలిచిన చోట ఒక మహా వృక్షం మాత్రం వుంది ! ఆశ్చర్య పోయింది, వల్లి ! —

ఇంద్రుడితో ఇప్పుడేమని చెబుతుంది ? ఎవర్ని గురించి చెబుతుంది ?—

'ఎవరూ లేరు బాబా !— ఊఁ— ఊరికేనా జడుసుకున్నా. అంతే !'— అంది.

*  *  *

కొండదొర నంబిరాజుకు అడవిలో ఒక శతవృద్ధుడు ఎదురయ్యాడు. ఎండలో నడిచి నడిచి పాపం, ఆ తాత ఎంతో అలసిపోయాడు. 'దాహం దాహం !!' — అంటూ, కిందని సొలిపోయాడు.

నంబిరాజు అతని ముఖం మీద ఇన్ని నీళ్లు చల్లాడు. తెలివిలో పడగానే దాహానికిచ్చాడు. వల్లిని పిలిచి, 'తల్లీ ! — ఇదుగో, ఈ తాతకు తగినట్టు శుశ్రూష చేసి, జాగ్రత్తగా కాపాడు !" అంటూ, ఆ వృద్ధుణ్ణి అప్పగించాడు.

ముసలివాణ్ణి వల్లి తన ఉద్యానానికి చేర్చింది. అనేక విధాలుగా శుశ్రూష చేస్తూ వుంది.

ఉన్నట్టే వుండి, ఒకసారి ఆ వృద్ధుడు, 'అమ్మాయీ ! నీకు పెళ్లయిందా ?' — అని అడిగాడు, వణుకుతున్న కంఠస్వరంతో.

"లేదు తాతా" అంది వల్లి, సిగ్గుతో.

"అట్లైతే, నన్ను పెళ్లాడతావా ?" అని అడిగాడు, బోసి నవ్వు నవ్వుతూ.

"ఛ, ఛీ ! తాతా ! — ఏం మాటలు ?"

# కార్యసిద్ధి

అంటూ, సిగ్గుతో కోపం నటించింది, వల్లి.

'పోనీగాని, ఎవర్ని పెళ్లాడుదామని వుంది ? నీ మనసులో వుద్దేశం నాతో చెప్పు ! మరి —' అన్నాడు.

'నా భర్తను ఎప్పుడో ఎంచుకున్నాను......' అంది వల్లి.

'అబ్బో, అబ్బో ! ఇంకేం ? — ఎవరమ్మా ఆయన ?' అంటూ, ఉత్సాహంతో అడిగాడు, ముసలివాడు.

'కుమారస్వామి ఆయన పేరు .....' అంది వల్లి.

"పిచ్చి పిల్లా ! — దేవుళ్లనే పెళ్లాడుతావా ? విడ్డూరంగా వుందే ! మరయితే నువు దేవుళ్లం టేనూ, దయ్యాలంటేనూ నమ్ముతావన్నమాట ? అవును గానీ, ఆయన్నెప్పుడయినా చూశావా ?' అని అడిగాడు తాత.

"చూడకేం ? — ఇందాకా వేటగాడి వేషంలో కనిపించాడు. నాస్వామి !" అని చెప్పింది, వల్లి.

'ఏమో ! నీస్వామి యెవరో నాకేం తెలియదు నన్ను నువ్వు పెళ్లాడే తీరాలి !' అని కచ్చితంగా చెప్పాడు, ఈమాటు వృద్ధుడు.

'ఆ ! లేకపోతే యేం చేస్తావేం ?' అంది వల్లి, కోపావేశంతో.

'లేకపోతేనా ......? — అదుగో అటుచూడు'

'ఏముంది, చూట్టానికి ? —'

'ఏముందా ? అలాగే చూస్తూ వుండు !' అని చెప్పి, ముసలివాడేదో స్తోత్రం పల్లించాడు.

చూస్తూండగానే, అడవిలోనించి ఒక మదపు టేనుగు ఉరక లేసుకుంటూ వచ్చింది ! — భయంతో వల్లి అటు పరిగెత్తింది. అటునుంచి ఇంకో యేనుగు ఇటు వస్తూంది ! ఉత్తర దిక్కు నుంచి మరొక యేనుగు ! దక్షిణ దశనుంచి ఇంకొకటి ! ఇంకిప్పుడు వల్లి ఎటుపోవడం ? ఎలా తప్పించుకోవడం ? —

'తాతా, తాతా !' అంటూ భయంతో రెండు చేతులతోనూ ఆ వృద్ధుణ్ణి పెనవేసుకుంది ! —

'మరి నన్ను పెళ్లాడతావా ?' 'ఆడతాను' అను ......' అంటూ, నిర్బంధించాడు, తాత.

అప్పుడు గత్యంతరం లేక వల్లి 'స్వామీ ! — నిన్నే నమ్ముకున్నా. నువ్వే నాకు దిక్కు ! రక్షించు !!' అని మనసులో కుమారస్వామిని తలుచుకుంది.

ఆశ్చర్యం ! —

ఏనుగులు లేవు. వృద్ధుడు లేడు. అస్థానే సాక్షాత్తు కుమారస్వామి ప్రత్యక్షమయ్యాడు. తనను తనే నమ్మలేక పోయింది, వల్లి !

ఈ సమయంలో నంబిరాజు అక్కడికి వచ్చాడు. వెంటనే స్వామి వేటగాడయ్యాడు ! — వేటగాడి ప్రక్కన వున్న తన కూతుర్ని చూడగానే నంబిరాజు ఉగ్రుడయ్యాడు. పటపట పళ్లు కొరుకుతూ, 'వీళ్లని ఖైదు చెయ్యండి !' అని సేనకులకు ఆజ్ఞాపించాడు.

ఇలా పట్టవచ్చిన పరివారాన్ని చూస్తూండగానే పడగొట్టేశాడు కుమారస్వామి. పౌరుషంతో మరి కొంత మంది వచ్చారు. వాళ్ల పనీ అంతే అయింది. అప్పుడు మిగిలి వున్న సైన్యంతో నంబిరాజే స్వయంగా వచ్చాడు. అందరినీ హతమార్చాడు స్వామి.

తన వాళ్లందరి గతీ ఇలా కావడంతో, దుఃఖం భరించలేక పోయింది వల్లి. వలవల యేడ్చింది!

అప్పుడు అక్కడ —

ఆరుతలలతో, నెమిలి వాహనం మీద కూచుని వున్న కుమారస్వామి దివ్య రూపం అందరికీ సాక్షాత్కరించింది ! స్వామి దర్శనమివ్వడంతో చచ్చిన సైనికులంతా మళ్లీ సజీవులయ్యారు !!—

అంతులేని సంతోషంలో నంబిరాజూ, ఆయన పరివారమూ స్వామికి ప్రణమిల్లారు. సాక్షాత్తు ఆ సుబ్రహ్మణ్యుడే తనకు జామాత కావడంతో, తన అదృష్టానికి నంబిరాజు ఉప్పొంగి పోయాడు !

అంతలో ఒక మదపుటేనుగు సంతోషంతో ఘీంకరిస్తూ అటు వచ్చింది.

'అన్నా, రా ! అంతా నీదయ !! నీ దీవెన కోసమే ఎదురు చూస్తున్నాం !!!' అంటూ, షణ్ముఖుడు ఆ యేనుగుకు మొక్కరిల్లాడు !

వల్లి మళ్లీ భయపడింది.

వెంటనే వినాయకుడు నిజ రూపంతో ప్రత్యక్షమై, తమ్ముడినీ మరదల్నీ ఆశీర్వదించాడు.

ఈ కథ చెప్పి, శుక్రాచార్యుడు — 'రాజా !



భారీయెత్తున దేశరక్షణకు

ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

తోశావా — గణేశుడికి తమ్ముడంటె ఎంత అభిమానమో ? అటువంటి ఆ అన్నాతమ్ములు ఒకటయితే, ఏ పని చేయలేరు ? ఎవరిని జయించ లేరు ? '

## 12

వినాయకుణ్ని గురించిన మరొక వింత కథ విను:

పూర్వం ఒక బ్రాహ్మణుడికి సోమిదేవమ్మ అనే ఇల్లాలు వుండేది. ఆమె చేసుకున్న అదృష్టం కొద్దీ కుటుంబానికి సిరీ సంపదా, పాడీ పంటా, అన్నీ పుష్కలంగా వున్నాయి. కానీ, ఆమెకు మాత్రం సంతోషమనేది లేకపోయింది. ఈ లోపం ఎందువల్ల కలిగిందో ఎవళ్ళూ చెప్పలేక పోయారు. ఈ బాధ అనుభవిస్తున్న ఆ సోమి దేవమ్మకే తెలియక పోయె !

రోజూ సోమిదేవమ్మ కొడుకులకూ కూతుళ్ళకూ వండి పెట్టి, సానిట్లో ఒకచోట తీరికగా కూచుని యేడుస్తుండేది. ఇరుగూ పొరుగూ వచ్చి 'ఏవమ్మా ఏం ఆపద వచ్చింది ? ఎందుకలా ఏడుస్తావు ? ' అంటూ వోదార్చేవారు.

' ఎందుకేడుస్తానో నాకే తెలియదు. కాని అస్తమానం నాకేడవాలని మనసు. ఎంత మాను దామనుకున్నా దుఃఖం మరీ ముంచుకువస్తుంది గాని, తగ్గడం లేదు ' అని చెప్పి, ' నాయనో.....య్ !' — అంటూ మళ్ళీ రాగం మొదలెట్టింది.

## కార్యసిద్ధి

ఆవిడకు ఇది ఒక పిచ్చి కాబోలని, అంతా వూరుకున్నారు. అయితే ఆవిడ రోజూ నిష్కారణంగా ఏడుస్తూ వుంటే, వూళ్ళోవాళ్ళు చూసి వూరుకోలేక పోయారు.

' ఏవమ్మోయ్, తీరికగా కూర్చుని ఇలా ఏడిస్తే గ్రామానికే అరిష్టం. నీకంతగా ఏడవాలనుంటే ఏ అడవిలోకో పోయి ఏడు .... ' అని వూళ్ళో పది మందీ పోగయి, కచ్చితంగా చెప్పేశారు.

అప్పటి నుంచీ సోమిదేవమ్మ ఇంట్లో అందరికీ వండి పెట్టి, అంతా పడుకున్నాక, అడవిలోకి పోయి, తీరిగ్గా కూచుని తనివితీరా యేడ్చేది.

ఇలా వుండగా —

ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు ఆకాశ మార్గాన పోతూ, ఈ యేడుపు విని కిందికి దిగి వచ్చారు. 'ఏవమ్మా, ఎందుకేడుస్తున్నావు? ఏం కష్టం వచ్చింది ?' అని అడిగారు.

అందుకు సోమి దేవమ్మ ' మీ కెందుకొచ్చిన గొడవ, తల్లీ ! మీరేమైనా ఆర్చేవాళ్ళా, తీర్చే వాళ్ళా ? మీదారిన మీరు వెళ్ళండి .....' అంది, నిస్పృహగా.

' అదేమిటమ్మా ! అలా అనేశావు ? ఆర్చే వాళ్ళమూ మేమే, తీర్చేవాళ్ళమూ మేమే. చెప్పు నీ కష్టమేమిటో!' అన్నారు పార్వతీ పరమేశ్వరులు.



'థాంక్యూసార్! నే నిప్పుడు అప్పడిగిన "ఐదే"నా ఇస్తున్నారు?'
'ఊహూఁ కాదు! ఉత్తరం పోస్టుచేసి పెడతావేమోనని......'

ఇలా అనగానే సోమిదేవి ' అమ్మా ! — నాకు సిరి వుంది. సంపద వుంది, పాడి వుంది, పంట వుంది. పిల్లా పాపా, బలగమంతా వున్నారు. దేనికీ లోటు లేదు. కాని, ఎందుకో ఏడవాలని బుద్ధి పుడుతుంది అస్తమానమూ. అలా ఎందుకు పుడుతుందో నాకే తెలియదు, పైవాళ్ళకేం తెలుస్తుంది ? ' అంటూ, మాయామర్మం లేకుండా తన బాధ వెల్లడించింది.

"ఓహో, అదా సంగతి ?— అయితే ఒక పని చెయ్యి. నువ్వింటికి వెళ్ళే దోవలో ఒక పెద్ద పుట్ట ఉంది. ఆ పుట్ట దగ్గర తిరిగే పాముల్లో ఒక దాన్ని పట్టి తీసుకువెళ్ళి, నీ కొడుకు పక్కలో పడెయ్. అది నీ కొడుకుని కరుస్తుంది. అప్పుడు 'అయ్యో, కొడుకు చచ్చాడే !' అని మనసు తీరా ఏడుద్దుగాని. . . . ' అని చెప్పి, పార్వతీ పరమేశ్వరులు మాయమయ్యారు !—

సరే సోమిదేవమ్మ పుట్ట దగ్గర పామును తీసుకుపోయి, కొడుకు పక్కలో పడేసింది. అయితే, ఆ పాము సోమిదేవి కొడుకుని కరవలేదు సరికదా, తీరాచూస్తే, అది వక బంగారు గొలుసుగా వూరుకుంది !—

మర్నాడు సోమిదేవి మళ్ళీ మామూలుగా ఏడుపు ప్రారంభించింది. ఆకాశ మార్గాన పోతున్న పార్వతీ పరమేశ్వరులు మర్నాడు కూడా, సోమిదేవి ఏడుపు విని, దిగివచ్చారు.

వాళ్ళని చూసి సోమిదేవమ్మ, 'అమ్మా ! నువ్వు చెప్పినట్టే చేశాను. కానీ, ఆ పాము నా కొడుకుని కరవనూ లేదు, ఏమీలేదు. కాగా, అదికాస్తా బంగరు తాడయి పోయింది. నా కిప్పుడు ఏడవటానికి కారణమేమీ కనిపించటం లేదు. మరెలాగా ?' మొర పెట్టుకుంది.

అందుకు పార్వతీదేవి, 'ఈసారి ఒకపని చెయ్— ఒక తేలును పట్టి నీ కూతురి కుంకం బరిణలో పెట్టు. పిల్లని తేలు అంట బొడుస్తుంది. నీ కూతురితో పాటు నువ్వూ గోలపెటి ఏడుద్దుగాని. . .' అంటూ సలహా చెప్పింది.

పార్వతీదేవి చెప్పినట్టే సోమిదేవమ్మ అక్షరాలా చేసింది. కూతురు ఎప్పుడు ఏడుస్తుందా అని తల్లి కనిపెట్టుకునుంది. కానైతే, మర్నాడు పొద్దున్నే పిల్ల కుంకం బరిణె తీసి చూసి, ఆశ్చర్యంతో 'అమ్మా !— నా బరిణలో బంగారు నత్తు పెట్టా రెవరే ?' అని అడిగింది.

తల్లికి మరీ ఆశ్చర్యం వేసింది. ఆ రోజు మళ్ళీ అడవికి పోయి, శోకాలు తీసింది.

మూడో రోజున మళ్ళీ పార్వతీదేవి ప్రత్యక్షమై 'ఏమిటి సంగతి ?' అని అడిగింది. చింతతో కుంగి పోతున్న సోమిదేవమ్మ, బదులుగా, 'ఎందుకు నన్ను పలకరిస్తావు మాయమ్మా ! నా బతుకే వేళాకోళమై పోయింది. నిన్ను నమ్మి, నువ్వు చెప్పినట్టే చేశాను. నా కూతుర్ని ఆ తేలు కుట్టనూ లేదు, యేడవాలేదు. పైగా అది కాస్తా బంగారు నత్తు అయి వూరుకుంది. నేనేమని చెప్పుకు యేడ్చేది ?—' అని మొరపెట్టుకుంది.

ఈ మాటకు పార్వతీదేవి ఇలా చెప్పింది— 'అయితే ఈ సారి ఒక పని చెయ్. మీ ఇంటో నువ్వు

పెంచిన పిల్లి ఉరదికదా! [illegible] వచ్చింది.

పెట్టుకుని ఏడు' అని.

అదే ప్రకారం సోమిదేవమ్మ ఇంటికి వెళ్ళగానే, తన పెంపుడు పిల్లిని చంపేసి, ఒళ్ళో పెట్టుకు ఏడవసాగింది. అయితే, ఆవిడ కళ్ళ నీళ్ళు దాని మీద పడగానే, ఆ చచ్చిన పిల్లికి ప్రాణం వచ్చి, అది వెంగున గెంతి, పారిపోయింది !—

ఇలా మూడుసార్లూ పార్వతి చెప్పిన సలహా పనికి రాకుండా పోయేసరికి, సోమిదేవమ్మకు చెప్పలేని ఆవేదన పట్టుకుంది. ఏడవటానికి తగిన కారణం కనబడక, ఆమెకు మతిపోయినట్లయింది. ఇంక ఎవర మాటలూ నమ్మి ప్రయోజనం లేదని నిశ్చయించుకుని, మళ్ళీ మామూలుగా అరణ్యంలోకి పోయి, ఏడుస్తూ కూచుంది.

ఇప్పుడు పార్వతీ పరమేశ్వరులు మళ్ళీ ప్రత్యక్షమయ్యారు :

'ఓ సోమిదేవమ్మా !— లోగడ నువ్వు గణేశుడి నోము పట్టి ఉన్నావు. జ్ఞాపకముందా ? నోము పట్టిన ఫలితంగా, నా కొడుకు గణేశుడు నీకు సిరి, సంపదా ఇచ్చాడు, కానీ, ఆ నోము ఉల్లంఘన చేసినందుకు కోపం వచ్చి, శిక్షగా నీకీ నిత్య విచారం కూడా ఇచ్చాడు.

'కనుక నువ్విప్పుడు మళ్ళీ గణేశుడి నోము పట్టి, ఏడాది పాటు భక్తితో అక్షతలు వేసుకుని, సవ్యంగా ఉద్యాపన చేసుకో నీకీ విచారం పోతుంది. కథ లోపమైనా, వ్రతలోపం కాకూడదు. భక్తులు అంతర్ధాన మయ్యారు.

ఆ ప్రకారం సోమిదేవమ్మ భక్తితో ఏడాదిపాటు గణేశ వ్రతం చేసి, అక్షతలు వేసుకుని, సిరి సంపదలతో పాటు అంతులేని సంతోషం కూడా పొంది సుఖంగా ఉంది.'

—ఈ కథ చెప్పి క్రాకు చార్యుడు :

'రాజా!— సిరి సంపదలనూ సుఖసంతోషాలనూ కోరి, ఈ నాటికీ భూలోకంలో ప్రజలు గణేశ వ్రతం చేసుకుంటూనే ఉన్నారు. సోమిదేవమ్మను శోధన చేసిన వాడే నిన్నింతగా భయపెడుతున్న ఆ గణేశుడు. . . .' అని చెప్పి, ముగించాడు.

## 13

'రాజా !— మరొక సంగతి విను :

ఇవాళ బాలగణపతి పార్వతీదేవి ఒళ్ళో కూచుని ఆడుకుంటూండగా, ఉన్నట్టే ఉండి, ఆకాశం నిండా మేఘాలు కమ్ముకున్నాయి. ఇదేమిటా ఈ చిత్రం! అని, కైలాసంలో ఉండే పిన్నా పెద్దా అంతా ఇవతలికి వచ్చి, చూడసాగారు. ఓహో, వాన కురుస్తుంది కాబోలనుకుని పసిపాపలు సరదాకొద్దీ వానావానా చెల్లప్ప ఆడుతున్నారు ! పడవల్లాగా నీళ్ళలో వేసి ఆడటానికి చిన్నచిన్న పుల్లముక్కలు జాగర్త పెడుతున్నారు !—

ఇటువంటి సమయంలో—

బ్రహ్మాండమయిన ఒక గెద్ద రివ్వుమని ఎగురు రావడమేమిటి ?— దేవి ఒళ్ళో ఉన్న వినాయకుణ్ణి అమాంతంగా తన్నుకు పోయింది !— పార్వతి కెవ్వున కేకపెట్టి, మూర్ఛపోయింది. అక్కడ ఉన్న యావన్మందీ ఆకాశంవేపు చూస్తున్నారే గానీ, పడిపోయినపార్వతి సంగతి ఒక్కళ్ళూ గమనించనేలేదు.

రివ్వున ఎగిరిన ఆ పక్షి ఆకాశమండలమూ, అంతరిక్షమూ దాటిపోతూ ఉంది. అలా పైపైకి పోతూ ఉంటే, దాని ఈకలు ఒక్కొటొక్కటే గాలిలో ఎగురుతూ వచ్చి, కైలాసం నిండాపడ్డాయి!

మరి కొంతసేపటిలోనే ఆ పక్షి కాళ్ళు రెండూ, రెండు మహావృక్షాల్లాగా కింద పడ్డాయి !

ఇంకాస్సేపటికల్లా కైలాసం దద్దరిల్లేటట్టుగా 'గణా ! గణా ! !'— అనే పొలికేకలు వినిపించాయి!!

అంతే—

ఆ వెంటనే, భీకరమైన ఒక పెద్ద రాక్షసరూపమూ, దాని మెడని గట్టిగా అంటిపట్టుకుని ఉన్న బాలగణపతి దిబ్బున కిందపడ్డారు !

'అయ్యో, మన గణపతి ! మన గణపతి !—' అంటూ, తోటి పిల్లలంతా పోయి, కిందపడ్డ గణపతిని చుట్టేశారు. ఈ సందడికి పార్వతీదేవి తెలివిలో పడింది. అమాంతం తన బిడ్డను ఎత్తుకుని, గుండెకు హత్తుకుంది !

ఇంత పని చేసిన ఆ రాక్షసుడెవరో కాదు, మన ఆస్థానం నుంచి వెళ్ళిన కృతాసురుడే !—

(సశేషం)



'సంగం' చిత్రంలో రాజ్ కపూర్, వైజయంతిమాల

## "మంగమ్మ శపథం"

డి. వి. యస్. ప్రొడక్షన్సు వారు "మంగమ్మ శపథం" చిత్రాన్ని వాహినీ స్టూడియోలో షూటింగు ప్రారంభించారు. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, రేలంగి, మిక్కిలినేని, బాలకృష్ణ, నల్ల రామమూర్తి, జమున, గిరిజ మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి సంభాషణలు : సముద్రాల (జూనియర్); పాటలు : సి. నారాయణరెడ్డి అండ్ కొసరాజు; సంగీతం : టి. వి. రాజు; ఛాయ : రవికాంత్ నిగాయిజ్; కళ : తోట; నృత్యం : వెంపటి సత్యం; కూర్పు : జోషి; స్టూడియో: విజయా అండ్ వాహినీ; దర్శకత్వం : బి. విఠలాచార్య; నిర్మాత : డి. వి. యస్. రాజు.

## "దైవనిర్ణయం"

నాగ ప్రసాద్ ప్రొడక్షన్సువారు "దైవ నిర్ణయం" అనే చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో కృష్ణకుమారి, రాజశ్రీ, జయశ్రీ, రాజకుమార్, ఉదయకుమార్, మొదలగువారు నటించారు. ఈ చిత్రానికి రచన : అనిసెట్టి; సంగీతం : సత్యం; కూర్పు : సుందరం; ఛాయ అండ్ దర్శకత్వం : ఎన్. ఎస్. వర్మ; నిర్మాత : టి. యం. సుందరం.

# మద్రాస్ సినీమా వార్తలు

## "అగ్గి - పిడుగు"

విఠల్ ప్రొడక్షన్సు వారు నిర్మిస్తున్న తాజా చిత్రం "అగ్గి పిడుగు" రీరికార్డింగ్‌తో సహా పూర్తి అయింది. జూలై నెలాఖరుకు విడుదల కానున్నది. ఈ చిత్రంలో యన్. టి. రామారావు ద్విపాత్రాభినయం ఒక ప్రత్యేకత. ఇంకా ఈ చిత్రంలో నాగయ్య, కృష్ణకుమారి, రాజనాల, ముక్కామల, సత్యనారాయణ, బాలకృష్ణ, జయంతి, రాజశ్రీ, సత్యం మొదలగువారు నటిస్తున్నారు. రచన : జి. కృష్ణమూర్తి., సంగీతం: రాజన్ — నాగేంద్ర; ఫొటోగ్రఫీ : రవికాంత్ నిగాయిజ్; కో — డైరక్టర్ : యస్. డి. లాల్; నిర్మాత : దర్శకుడు : బి. విఠలాచార్య.

## మాధవీ ప్రొడక్షన్సు నెం. 1

మాధవీ ప్రొడక్షన్సువారు మహాభారతంలోని ఘట్టాలు జూదం, వస్త్రాపహరణం, వనవాసం వరకు మహాభారతాన్నే చిత్రీకరిస్తున్నారు. ఈ పౌరాణిక చిత్రానికి ఇంకా నామకరణం చేయు లేదు. భారీఎత్తున నిర్మిస్తున్న యీ చిత్రం సంక్రాంతికి విడుదల చేయాలని నిర్మాత ఆశయం.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు భీముడు, ఎస్. వి. రంగారావు—దుర్యోధనుడు, సావిత్రి—ద్రౌపది, గుమ్మడి—ధర్మరాజ, కాంతారావు—శ్రీకృష్ణుడు, బాలయ్య—అర్జునుడు, రాజనాల—సైంధవుడు, సత్యనారాయణ — ఘటోత్కచుడు, మిక్కిలినేని — దుశ్శాసనుడు, ప్రభాకరరెడ్డి — కర్ణుడు, రమణారెడ్డి—బ్రహ్మాండం, పద్మనాభం—లక్ష్మణకుమారుడు, ముక్కామల — దుర్వాసుడు, సంధ్య—భానుమతి, ఎల్. విజయలక్ష్మి—శశిరేఖగా నటిస్తున్నారు.

సౌగంధిక వనంలో రాజసులోచన నృత్య ప్రదర్శన చేస్తుంది.

భీముడు సౌగంధిక పుష్పం గురించి సౌగంధిక వనంలో ప్రవేశించడం, ఆంజనేయుడు అడ్డు పడుట, ఇద్దరికీ యుద్ధం. ఈమధ్య చిత్రీకరించారు.

ఆంజనేయుడుగా కుస్తీల వస్తాద్ అజిత్ సింగ్ వేశారు.

ఈ చిత్రానికి రచన—సముద్రాల (సీనియర్), సంగీతం—ఘంటసాల, ఛాయ—సి. నాగేశ్వరరావు,

# సినిమా వార్తలు

స్పెషల్ ఎఫెక్ట్సు—రవికాంత్ నగాయిచ్, కళ—ఎస్. కృష్ణారావు, నృత్యం—పసుమర్తి, కూర్పు—సంజీవి, స్టూడియో—విజయా—వాహినీ, నిర్మాత: ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు

## హైదరాబాద్ మూవీస్ ప్రొడక్షన్ నెం. 3

హైదరాబాద్ మూవీస్‌వారు నిరుపమాదేవి వ్రాసిన "అన్నపూర్ణ మందిరం" నవల మూలాధారంగా నిర్మిస్తున్న ప్రస్తుత తాజా సాంఘిక చిత్రం పి. కన్నాంబ అస్వస్థత — తరువాత చనిపోవడం వలన ఈ మధ్య చాలా కాలం ఆగి పోయింది. కన్నాంబ ఆఖరి చిత్రం ఇదే కావచ్చు. తిరిగి ఈ చిత్రం షూటింగు ఆగస్టు 2వ, తేదీ నుండి వాహినీ స్టూడియోలో ప్రారంభిస్తున్నారు.

ఈ చిత్రంలో జగ్గయ్య, జమున, కన్నాంబ, హేమలత, గుమ్మడి, రమణారెడ్డి, సూర్యకాంతం, వలం, గీతాంజలి, వాసంతి, లక్ష్మీకాంతమ్మ, రాజబాబు మొదలగువారు నటిస్తున్నారు. పాత నటుడు చంద్రశేఖర్ ఈ చిత్రంలో తిరిగి ఒక ముఖ్యమైన పాత్ర ధరిస్తున్నాడు.

ఈ చిత్రానికి రచన: డి. వి. నరసరాజు; పాటలు: ఆత్రేయ, ఆరుద్ర, కొసరాజు, సి. నారాయణరెడ్డి; సంగీతం: కోదండపాణి; కళ: నూరప్ప; నృత్యం: ప్రకాశరావు; అసోసియేట్ దర్శకత్వం: పి. సాంబశివరావు; దర్శకత్వం: సి. యస్. రావు; నిర్మాత: గంగాధరరావు.

ఈ చిత్రాన్ని త్వరగా పూర్తిచేసి నవంబరు నెలలో విడుదల చేయనున్నారు.

## "హరిశ్చంద్ర"

విజయా ప్రొడక్షన్సువారు "హరిశ్చంద్ర" చిత్రాన్ని నిర్మించదలచుకున్నారు. సెవరు పర్సు స్ఫూర్తి కావచ్చింది. హరిశ్చంద్రుడుగా ఎన్. టి. రామారావు, విశ్వామిత్రునిగా ఎస్. వి. రంగారావు, నక్షత్రకునిగా రమణారెడ్డి, కాల కౌశకునిగా రేలంగి, చంద్రమతిగా ఎస్. వరలక్ష్మిని ఎన్నుకున్నట్లు తెలుస్తుంది. మిగతా నటవర్గ ఎన్నిక జరుగుతుంది.

ఈ చిత్రానికి రచన—పింగళి నాగేంద్రరావు, సంగీతం—పెండ్యాల నాగేశ్వరరావు, దర్శకత్వం—కె. వి. రెడ్డి, నిర్మాతలు—నాగిరెడ్డి అండ్ చక్రపాణి

## జెమినీవారి తెలుగుచిత్రం

జెమినీ పిక్చర్సువారు తెలుగులో సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, దేవిక, ఎస్. వి. రంగారావు, రేలంగి, రాజనాల, ముక్కామల, సత్యనారాయణ మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి పాటలు—ఆత్రేయ, సంగీతం—విశ్వనాథం రామమూర్తి, దర్శకుడు—వేదాంతం రాఘవయ్య.

## రాజ్యం పిక్చర్సు "శకుంతల"

రాజ్యం పిక్చర్సువారు మహాకవి కాళిదాసు వ్రాసిన "అభిజ్ఞానశాకుంతలము" ను చిత్రంగా తీయడానికి సన్నాహాలు చురుకుగానే సాగిస్తున్నారు.



ఉభయభాషా తార సావిత్రి ప్రత్యేక చిత్రం.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, సావిత్రి, రంగారావు, రేలంగి మొదలగువారు నటిస్తారని తెలుస్తుంది.

ఈ చిత్రానికి రచయిత—సముద్రాల (సీనియర్) ఛాయ—రహెమాన్, కళ—టి. వి. ఎస్. శర్మ, దర్శకుడు—కమలాకర కామేశ్వరరావు, నిర్మాతలు — శ్రీధరరావు, లక్ష్మీరాజ్యం.

## శ్రీకృష్ణ తులాభారం

సురేష్ ప్రొడక్షన్సువారు తమ ద్వితీయ కానుక పౌరాణిక చిత్రం "శ్రీకృష్ణ తులాభారం" ను నిర్మించడానికి చురుకుగా ప్రయత్నాలు సాగిస్తున్నారు. రచన: సముద్రాల (సీనియర్); ఈ చిత్రంలో యన్. టి. రామారావు శ్రీ కృష్ణుడుగా నటిస్తున్నారు. శ్రీమతి పి. భానుమతి కూడా నటిస్తున్నదని తెలుస్తుంది. ఈ చిత్రానికి దర్శకుడు తాపీ చాణక్య; నిర్మాత: డి. రామానాయుడు.

## భరణీవారి "వివాహబంధం"

బెంగాలీ చిత్రం "సాత్ పాకే బాంధా" ఆధారంగా భరణీవారు "వివాహబంధం" పేరుతో సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో భానుమతి, ఎన్. టి. రామారావు, సూర్యకాంతం, నాగయ్య, బాలయ్య, ప్రభాకరరెడ్డి, పద్మనాభం, వాసంతి, హేమలత, హరనాథ్ మొదలగువారు నటిస్తున్నారు. సంభాషణలు—పిచ్చేశ్వరరావు, పాటలు—సి. నారాయణరెడ్డి, ఛాయ—అన్నయ్య; సంగీతం— ఎం. బి. శ్రీనివాస్, సంగీత పర్యవేక్షణ—పి. భానుమతి, నిర్మాత—దర్శకుడు—పి. రామకృష్ణ.

సి. ధర్మారావు. ★



"మంచిమనిషి"లో ఒక దృశ్యం.

అజీర్ణము
వల్ల ఎందుకు
బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి

ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మంద కొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.




**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**

**C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ 86/A నయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3**

NT/CJH 2220 A



ఆంధ్రప్రదేశ్ శాసన పరిషత్ కి అధ్యక్షులుగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

## శ్రీ శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రసచిత్ర వారపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారు, ఆరు తూర్పు ఆఫ్రికా దేశాలలో పర్యటన చేయడానికిగాను జూలై 24 న ఇక్కడినుంచి బయలుదేరి వెళ్ళారు. వారు బొంబాయి నించి 26 న బయలుదేరి నైరోబీ వెళ్ళారు. మద్రాస్ విమానాశ్రయంలో పలువురు బంధుమిత్రులు వారికి వీడ్కోలు యిచ్చారు.

*　　*　　*

కాకినాడ సూర్యకళామందిరంలో జూలై 12 వ తేదీన స్థానిక రైల్వే కల్చరల్ ఎసోసియేషన్ ఆధ్వర్యమున శ్రీ బుచ్చిబాబు రచించిన ఉజ్వల సాంఘిక నాటకం "ఆత్మవంచన" ను అత్యధిక వ్యయ ప్రయాసల కోర్చి ప్రదర్శించి పురజనుల, పెద్దల ప్రశంసాభిమానములకు పాత్రులైనారు. ముఖ్యంగా రాజశేఖరంగా శ్రీ గజేంద్రరావు, గోపాలంగా శ్రీ కె. కె. శర్మ, రాణిగా శ్రీమతి సీతాదేవి గారల నటన ప్రదర్శనాని కంతకు వన్నె తెచ్చింది. ప్రదర్శనలో అడుగు అడుగునా శ్రీ కొండేటి రామారావుగారి దర్శకత్వ ప్రతిభ గోచరించింది. రంగాలంకరణ శ్రీ "జానకి" స్పెషల్ ఎఫెక్ట్సు వారితో కూడా సంయుక్తంగా శ్రీ హరనాన్ బాబు నిర్వహించారు. సంగీతం శ్రీ పి. గంగాధర్ కూర్చినారు. కార్యక్రమమును అత్యంత శ్లాఘనీయంగా నిర్వహించిన కార్యదర్శి శ్రీ సి. రామారావుగారు అభినందనీయులు.

## 'ఆంధ్రపత్రిక అభ్యుదయ కళా మండలి' నూతన కార్యవర్గం

ఆంధ్రపత్రిక అభ్యుదయ కళామండలి సభ్యులు పత్రికా కార్యాలయం భవనంలో ఇటీవలనే సమావేశమై 1964—65 సంవత్సరానికి ఈ క్రింది వారిని కార్య నిర్వాహకులుగా ఎన్నుకున్నారు ఎన్నికలను శ్రీ బి. ఎస్. శాస్త్రి నిర్వహించారు.

అధ్యక్షులు : శ్రీ పి. త్యాగరాయచెట్టి, ఉపాధ్యక్షులు : శ్రీ వి. నారాయణస్వామి, కార్యదర్శి : శ్రీ జి. ఆర్. సుబ్రహ్మణ్యం, ఉపకార్యదర్శి : శ్రీ పి. మురళి, కోశాధికారి : శ్రీ ఎస్. జి. జ్ఞానశేఖరం, లైబ్రేరియన్ మరియు ప్రచారశాఖ : శ్రీ కె. రామచంద్రయ్య.

## శ్రీ ఎమ్. ఎస్. రావుకు అమెరికా ఆహ్వానం

అమెరికాలోని ప్రచురణ సంస్థలను చూచేందుకు, ఆ రంగానికి సంబంధించిన వారిని కలసికొని ముచ్చటించేందుకుగాను సాంస్కృతిక వినిమయ కార్యక్రమం క్రింద యం. శేషాచలం అండ్ కంపెనీ కార్యదర్శి, భాగస్వామి, 'పుస్తక ప్రపంచం' సంపాదకులు అయిన శ్రీ ఎమ్. ఎస్. రావును అమెరికా ప్రభుత్వం తమ దేశానికి ఆహ్వానించింది. శ్రీ రావు సెప్టెంబరులో పర్యటనకు వెళ్ళ గలరని తెలుస్తున్నది. ★

## అవీ - ఇవీ - అన్నీ

### స్వీకారం

అమెరికా అధ్యక్ష పదవి : మూలం : క్లింటన్ రోసిటర్, అనువాదం : వి. నారాయణరావు, యం. శేషాచలం అండ్ కో, వారి ప్రచురణ. ప్రాప్తిస్థానం ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, గాంధీ పతి రోడ్డు, సికింద్రాబాదు, వెల: 5.00. ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య గారి "తొలి పలుకు" వున్న ఈ పుస్తకం మా కార్యాలయం చేరింది.

*　　*　　*

"కల్పవల్లి" మొదటి భాగం — వివిధ పద్యాల సంకలనం. రచన : కృత్తివెంటి. వెంకటేశ్వరరావు. వెల : రు. 1.50లు. వెంకటేశ్వర గ్రంథమాల ప్రచురణ మా కార్యాలయం చేరింది.

*　　*　　*

సూరి నాగమ్మ గారి రచన శ్రీ రమణాశ్రమ లేఖలు — ఐదవ భాగం మా కార్యాలయానికి చేరింది. వెల : రు 1.75. ప్రకాశకులు : టి. యన్. వెంకట రామన్, ప్రెసిడెంటు, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై.

*　　*　　*

"పాముల మంత్రాలకు" సంబంధించిన "నాగ దేవత" పుస్తకం మా కార్యాలయం చేరింది. రచన : శ్రీ చింతాడ. నాగేశ్వరరావు, అసిస్టెంటు స్టేషన్ మాస్టరు, తాడిపత్రి.

*　　*　　*

ఎడ్వర్టయిజింగ్ ఎండ్ సేల్స్ ప్రమోషన్ కంపెనీ వారి సాంవత్సరిక ఆదాయం 1964లో ఒక కోటి రూపాయలు దాటింది. అంటే, భారత దేశంలో ఈ ప్రకటనా సంస్థ స్థానం మూడవది అన్న మాట; దీని మానేజర్ శ్రీ ఎస్. డా. కున్హా.

# ఇందిరా గాంధీ

31 వ పేజీ తరువాయి

మధ్య వర్తకం ఎలాఉంది ? అది పెరుగుతున్నదా? ఆ దేశం మీకిస్తామన్న సహాయం సక్రమంగానే అందచేస్తున్నదా ? 'మిగ్' విమానాలు రావటం, వాటి తయారీ మాట ఏమిటి ?

జ : కార్యక్రమం ప్రకారం అన్నీ జరిగిపోతున్నా యని, రెండు దేశాల మధ్య వర్తకం కూడా ఎక్కువయిందని అనుకొంటాను. మేము ఈ మధ్యనే అక్కడ జయప్రదంగా వ్యాపార సంబంధమైన ప్రదర్శనను కూడా ఏర్పాటు చేశాం.

ప్ర : మరి 'మిగ్' విమానాల మాట ఏమిటి ?

జ : పైనే చెప్పాను— ఒక దాని తరువాత ఒకటి సాగిపోతున్నదని— !

ప్ర : అంటే 'మిగ్' విమానాల కార్యక్రమం సాగిపోతున్నదా ?

జ : చర్యలు జరుగుతున్నాయి. వివరాలు తెలియవు.

ప్ర : అంటే, కర్మాగారం ఇంకా నెలకొల్పబడలేదనీనీ, ఉత్పత్తులు ప్రారంభం కాలేదనేగా మీరు చెప్పేది ?

జ : నా దగ్గర పూర్తి వివరాలు లేవు.

ప్ర : ఉత్తర సరిహద్దుల్లో చైనా దురాక్రమణ జరిపిన వాస్తవం దృష్ట్యా, ఇండియా ఎలాంటి గుణపాఠాన్ని నేర్చుకొనగలిగింది ?

జ : మేము, మరికొంత దృఢంగా సమాయత్తం కావలసిన అవసరాన్ని, సైనికశాఖ పట్ల కూడా దృష్టిని కేంద్రీకరించవలసిన ఆవశ్యకతను, ఆర్థికాభివృద్ధి యొక్క ప్రాధాన్యతను, ఆ సరిహద్దు ప్రాంతాల అభివృద్ధి యొక్క ప్రాముఖ్యతను మరింత గ్రహించాము.

ప్ర : ఈ సంఘటన లన్నింటి దృష్ట్యా శ్రీ మీనన్ భవిష్యత్తును గురించి మీరు ఏం వూహించారు ?

జ : ఇప్పుడే కాదు. మునుపు కూడా ఎన్నో మార్లు చెప్పాను. మీనన్‌కు పార్టీలో బలంలేదని. నేటి పరిస్థితీ అంతే.

ప్ర : శ్రీ మీనన్‌కు మీ వద్ద, మీ తండ్రి గారి వద్ద ఎక్కువ పలుకుబడి ఉన్నట్లు వార్త— అది నిజమా ?

జ : కానేకాదు. ఆ మాటలు ఎన్నటికీ నిజంకావు.

ప్ర : పోనీ, మరో మాట. అమెరికా ముందుకు ఇంకా అధికంగా ఆయుధ సామగ్రిని ఇండియాకు అందజేస్తే, అమెరికా ఈ నాడు ఆగ్నేయ ఆసియాలో నిర్వహిస్తున్న సైనిక కార్య కలాపాలను ఇండియా కూడా పంచుకో గలుగుతుందా ?

జ : అది ఎంతవరకు సాధ్యమోనేను చెప్ప లేను. మేము సంరక్షించుకోవలసిన సరిహద్దులే చాలా పెద్దవి. చైనా మా సరిహద్దుల్లో సేనలను కేంద్రీకరిస్తున్నది. అందువల్ల మీరు చెప్పినది ఎంత వరకు సాధ్యమో—?

[ఇంటర్వ్యూ చేసినది :
మార్గరెట్ హిగిన్స్
ఫిలిప్ పాటర్]





Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press: 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'హంతకుడెవరు'లో జెమినీచంద్ర